

పెద్ద పెద్ద రవ్వలు రేగుతున్నాయి! సోవియట్ భారతీయ వెల్డర్లు భుజం భుజం కలిపి పనిచేస్తూ, భిలాయ్ ఉక్కు పరిశ్రమ నిర్మాణంలో తమ కృషిని సమర్పిస్తున్నారు.

ఉక్కు మిల్లు చత్రుం అప్పుడే లేస్తున్నది. మిల్లు పని ప్రారంభం, భారత పారిశ్రామికీకరణలో ఒక పెద్ద మెట్టు.

భిలాయ్ ఉక్కు పరిశ్రమకు సంబంధించిన అనేక విషయాలు, ఈ సంచికలో 10వ పుట నుండి 28వ పుటలలో వెలువడ్డాయి.

## ఈ సంచికలో

సంపుటి 8,
సంచిక 24.

# సోవియట్ భూమి

డిసెంబర్ 28,
1957

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచార శాఖచే ప్రచురింపబడుతోన్న సచిత్ర పక్ష పత్రిక



## రాబోవు సంచికలో






ఈ ఏడాదికి మా వీడ్కోలు చెబుతూ, మా పాఠకులకు నూతన సంవత్సర శుభాకాంక్షలు అందజేస్తూ, 1958 "సోవియట్ భూమి" ప్రప్రథమ సంచికలో రానున్న ఆసక్తిదాయకమైన ఒక విషయాన్ని వారి దృష్టికి తెస్తున్నాము.

స్ఫూత్నిక్కులు అంతరిక్షంలోకి ఎగురవేయబడినప్పటినుండీ విజ్ఞానశాస్త్రంలో రానున్న దశ ఏమిటన్న ప్రశ్న మనలో ప్రతి ఒక్కరినీ ఆశ్చర్యపరుస్తున్నది. ఈ ప్రశ్నకు సమాధానాన్ని పొందటానికి మా విలేఖరులు అనేకమంది సోవియట్ శాస్త్రజ్ఞులను ఇంటర్వ్యూ చేశారు. రాబోవు సంచికలో వీటిదొక ఆకర్షణీయమైన ప్రత్యేక శీర్షిక.

దీనితోబాటు, మామూలు శీర్షికలూ, అనేక వార్షికోత్సవాలు జరిగిన 1957వ సంవత్సర సమీక్ష ఉంటాయి. ఈ సమీక్షను వ్రాసినది సోవియట్ దేశంలోని భారత రాయబారి శ్రీ కె. పి. ఎస్. మీనన్.



## ఈ ఏడాదికి మా వీడ్కోలు

1957కు వీడ్కోలు చెబుతున్నాము. కాగా ఇదొక మంచి మాటతో, స్మరించుకోదగిన సంవత్సరం. సోవియట్ దేశానికి ఇది మంగళప్రదమైంది... ప్రపంచ ప్రప్రథమ సోషలిస్టు ప్రభుత్వము 40వ వార్షికోత్సవం జరుపుకొన్న స్మరణీయ సంవత్సరం.

ఈ విశిష్ట సంవత్సరపు ఘట్టాలు ప్రజాశక్తులు ఏ విధంగా పటిష్టమై పెంపొందాయో, ఒక ప్రజ 40 సంవత్సరాల క్రితం ఎట్లా మహత్తర విప్లవాన్ని సాధించిందో ప్రస్ఫుటం చేస్తున్నాయి. ఈ ఏడే క్యుబిషేవ్ జల విద్యుత్కేంద్రం నిండు శక్తితో పనిచేయడం ప్రారంభించింది. ప్రపంచంలో ఇది సాటిలేనిది. ప్రపంచ మంతట్లోకీ శక్తివంతమైన అణు సంయోగీకరణ యంత్రం (ప్రోటాన్ సింక్రాట్రాన్) అణు రహస్యాల సంశోధించుటలో అడుగులకు చొచ్చుకపోగలిగిన ఒక పెద్ద పరిశోధక విభాగం, ఒక చిన్న పట్టణం దుబ్నోలో నిర్మితమైంది. టియు-114 టర్బో-జట్ లైనర్, ప్రపంచంలోకల్లా పెద్దదైన విమానం ఈ సంవత్సరమే విహంగయానం చేసింది. ఎక్కడా ఆగకుండా ఈ విమానం, సుఖప్రదమైన దాని అంతర విభాగాలలో ఆసీనులైన 170 మంది ప్రయాణీకులను, మాస్కోనుంచి న్యూయార్కుకు తీసుక వెళ్ళగలిగినది. రెండు మానవ నిర్మిత ఉపగ్రహాలు, అంతరిక్షంలోకి ఎగురవేయబడ్డాయి. స్వతంత్రులైన ప్రజలు, దోపిడియొక్క దారుణత్వాన్ని ఎరుగని ప్రజలు, నిరుద్యోగ బాధలకు ఎరకాని ప్రజలు, గుత్తదారుల పీడనకు బలికాని ప్రజలు. జాతి, వర్ణ, స్త్రీ-పురుష, మత విభేదాలకు స్వస్తిచెప్పిన ప్రజలు, సమైక్యతతో సమ్మతితో కృషిసల్పే ప్రజలు సాధించగలిగిన దేమిటో ఈ ఉపగ్రహాలు విరజిమ్ముతున్న వెలుగులు లోకానికి విశదం చేస్తున్నాయి.

ఈ సంవత్సరం, వసంతంలో సోవియట్ రైతాంగం మధ్యన ఒక నినాదం ప్రభవించింది. —అమెరికాను తలకు సరిపడ పాలు, వెన్న, మాంసపు ఉత్పత్తిలో అందుకోవడమేకాదు, అధిగమించాలన్నది.

అమెరికాను అందుకోవడమే! అప్పటిలో అది కొందరికి అవాస్తవిక మనిపించింది. అయినా సోవియట్ దేశ సుప్రీం సోవియట్ వార్షిక సమావేశ వేదికమీదనుంచి, యన్. యస్.

(మిగత 33వ పుటలో)

# స్నేహానికి



"పరదేశి" చలనచిత్ర దర్శకులు, క్వాజా అహమ్మద్ అబ్బాస్ (ఎడమ), వి. ప్రొనిన్ (కుడి)

నాకు సుపరిచితమైన ఓల్గాతీరంతెరమీద కనిపించి, మంత్రమహిమవల్ల జరిగినట్టుగా మా త్వెర్‌పట్టణం శతాబ్దాల క్రితం జరిగింకా అన్నట్టుగా యుగయుగాల అంధకారంనుండి వెలుగులోనికి రాగా, యిటీవలనే గడిచిన రోజులు నాకు హటాత్తుగా జ్ఞాపకానికి వచ్చాయి. మాస్కోలోని లెనిన్‌గ్రాడ్‌స్కాయి రహదారి వెంబడిని, యిప్పుడు కలినిన్ అనబడే త్వెర్‌వేపుకు ఒక కారు పరుగులెత్తుతోంది. దానిలో నలుగురం ఉన్నాం. మా దేశంలో సుప్రఖ్యాతుడూ అభిమాన పాత్రుడూ, నాకు పాత మిత్రుడూ అయిన భారతీయ రచయిత క్వాజా అహ్మద్ అబ్బాస్, ఒక చరిత్ర ఆచార్యుడూ, ఉపాధ్యాయిని అయిన నా భార్య కారులో వున్నాం. సుమారు ఐదు శతాబ్దాల క్రితం రష్యన్ యాత్రికుడు అఫనసీ నికితిన్ పడవలు సుదూరాన వున్న, ఆ రోజుల్లో యూరోపియన్లకు ఊహాలోకంగా వున్న భారత దేశానికి యీ ప్రాచీన నగరంనుండే బయలుదేరాయి, మేము అక్కడికి వెళ్తున్నాం.

త్వెర్ నగరానికి బదులు యాత్ర చేసిన తొలి భారతీయుడు అహ్మద్ అబ్బాస్ అని మేము హాస్యాలాడుతున్నాం. కాని ఆ సమయాన ఆయన హాస్యాలకు సిద్ధంగా వున్నట్టుగా లేదు.

"మన మహా ప్రజలు స్నేహసంబంధాలు పెట్టుకుని యెన్ని శతాబ్దాలు గడిచిపోయాయి!" అన్నారు అబ్బాస్ మళ్ళీ ఆయన ఆలోచనా పూర్వకంగా "నవలకుగాని ఫిల్ముకుగాని యిది ఎంత గొప్ప వస్తువు!" అన్నారు.

అప్పుడే అనుకుంటాను ఫిల్ముతీయాలన్న భావం ఆయనకు అంకురించింది—యిప్పుడు భారతీయ, సోవియట్ నాటక కర్తల, ఫిల్ము డైరెక్టర్ల, నటుల సంయుక్తకృషిచే సృష్టింపబడిన, తెరపైకి

"పరదేశి"లోని కొన్ని దృశ్యాలు





# స్వరూపం

రచయిత:
బోరిస్ పొలెవోయ్
సోవియట్ గ్రంథకర్త

ఎక్కడందువారా భారత, సోవియట్ సంస్కృతుల యితోధిక మైత్రికి ప్రబల సాక్ష్యంగా వున్న యీ ఫిల్మ తీయాలన్న భావం.

అఫనసీ నికితిన్ పుస్తకం—భారత దేశానికి వచ్చి, దానినీ, దాని ప్రజలనూ మనసారా ప్రేమించిన ఆ అభ్యుదయకాముకుడైన, నిశిత పరిశీలకుడైన అఫనసీ నికితిన్ పుస్తకం, తెరపైని జీవం పోసుకున్నది. కాని యిది కేవలం సంఘటన పట్టికకంటె ఎంతో అధికమైనది. ఇది భావోద్దీపకమైన, నవ్యరుచులూరించే కథా కథనం. ప్రేక్షకులదృష్టిని వెంటనే ఆకట్టి, ఫిల్మునడిచే రెండున్నర గంటల సేపూ ఆతురతలో ముంచెత్తే, మేనుగగుర్పాటు కలిగించే కథ యిది.

రెండు దేశాల ఫిల్ముపనివారూ ఫలప్రదంగా, ప్రతిభావంతంగా పనిని నెరవేర్చారు. ఒక దానికొకటి ఎంతో దూరంగా వున్న, ఎంతో వైవిధ్యంగల, ఎంతో అందమైన రష్యా, భారత దేశమూ యీ ఫిల్ములో చాలా స్పష్టంగా చిత్రింపబడ్డాయి. సోవియట్ ప్రజలమైన మేము సుందర భారతీయ దృశ్యాలను, ఆసక్తితో, ఉద్రిక్తతతో చూస్తాము. మా దేశపు ప్రకృతి దృశ్యాలనూ, ఓల్గా నదిని, శోభిల్లుతోన్న బయళ్ళనూ, నల్లని తోటలనూ, రష్యన్ శీత కాలపు దృశ్యాలనూ భారతీయులు కూడా అదే ఆసక్తితో, అదే ఉద్రిక్తతతో చూడగలరని భావిస్తున్నాము.

మన ఉభయప్రజల బాహ్యస్వరూపం విభిన్నమైనది. ఓల్గా ప్రాంతానికి చెందిన, రాగిజుట్టుగల అఫనసీ నికితిన్ నిండు విగ్రహం విసుగూ విరామంలేకుండా భారత భూమిపైని సంచరిస్తుంది; గాఢమైన శరీరఛాయ, నల్లని జుట్టుగల అందమైన భారతీయుల సమూహంలో వింతగొల్పుతూ. కాని స్వరూపంలో తేడా వున్నప్పటికీ, నికితిన్‌కూ, ఆయనకు పరిచయమైన భారతీయులకూ మధ్య సమానగుణాలు చాలావున్నాయి—స్నేహపాత్రమైన ఆర్ద్రహృదయాలూ, ఒకరి ఆచారాలపట్ల ఒకరికిగల గౌరవమూ, సూక్ష్మమైన గొప్ప జిజ్ఞాస, పరిచయాలకోసం తహతహ, వాణిజ్యాభిలాష, యుద్ధానికీ, యితర దేశాల ఆక్రమణకూ అతీతమైన శాంతియుత భావాలూ.

మన ఉభయ మహాప్రజలమధ్య నెలకొన్న పరస్పర అవగాహన గౌరవాలకు లోతైన చారిత్రిక మూలాలుగలవనీ, అవి సత్సంప్రదాయపై ఆధారపడినవనీ యీ ఫిల్ము చూపుతుంది,

ఈ ఫిల్ముగురించి చెప్పేటప్పుడు, దాని విజయానికి ప్రబల కారణమైన దానినటుల నటనను విస్మరించలేము. ప్రత్యేకంగా నేను యిద్దరు ప్రతిభావంతులైన నటులను పేర్కొనదల్చుకున్నాను:

( మిగత 39వ పుటలో )





# "పరదేశి" కథానాయకుడు
# ఒలెగ్ స్ట్రిజెనోవ్

రెండేళ్ళ క్రితం ఒలెగ్ స్ట్రిజెనోవ్ పేరు ఎవరూ విని వుండరు. అలాంటిదీనాడు ఆయన పేరు సోవియట్ దేశంలోనేకాక, అనేక యితర దేశాలలో కూడా బాగా సుపరిచితమైంది. ఈ ఏడాది మేనెలలో కేన్స్‌లో జరిగిన పదవ అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో ఫ్రెంచి ఔత్సాహికులు ఆయనను తమ అభిమాన నటుడైన గెరార్డ్‌తో పోల్చారు. ఒలెగ్‌కు "సోవియట్ గెరార్డ్ ఫిలిపె" అని పేరుపెట్టేరు.

ఈ ఇద్దరూ కూడా ప్రతిభావంతులైన కళాకారులే. అయితే వారి ప్రతిభా విశేషాలు వేరువేరు రూపాలుగా వున్నాయి. గెరార్డ్ నటించే పాత్రలు తేలికైనవి, హాస్యరస భరితమైనవి. ఒలెగ్ పాత్రలు గంభీరంగా రసాత్మకంగా వుంటాయి.

*గాడ్‌ఫ్లయ్* పాత్రలో స్ట్రిజెనోవ్ ఈ ప్రతిభావిశేషాలనే అద్భుతంగా కనబర్చారు. లెనిన్‌గ్రాడ్ స్టూడియోస్ యీ చిత్రాన్ని 1955లో నిర్మించింది. ఇదే ఆయన తొలిసారిగా నటించిన పాత్ర, దీనితో ఆయన కీర్తి సర్వత్రా వ్యాపించింది.

ఆయనకీ విజయం యాదృచ్ఛికంగా వచ్చినదికాదు. ఈ యువ నటుడు సినీమాకు పెద్ద అనుభవంతో రాకపోయినా, రంగస్థలంపై నటనానుభవమూ, నాటక కళలో మంచి శిక్షణ పొందివున్నారు.

1953లో, *ఎవ్‌గెనీ వక్తాన్‌గోవ్* థియేటర్‌కు చెందిన ప్రఖ్యాత మాస్కో స్టూడియో పాఠశాలలో ఆయన శిక్షణను పూర్తిచేసుకున్నాడు. ఉన్నత నాటకకళా పాఠశాలల్లో యిదొకటి. అక్కడి విద్యార్థులు శిక్షణతోపాటు రంగస్థలంమీద ప్రాక్టికల్ వర్కు కూడా చేస్తారు. స్టూడియో థియేటర్‌లో ఒలెగ్ రోమియో పాత్రతో సహా అనేక ముఖ్య పాత్రలు నటించారు.

## నవాన్వేషణ

స్టూడియో పాఠశాలలో శిక్షణ పూర్తి అయిన తరవాత, ఎస్తోనియన్ రిపబ్లిక్ రాజధాని తాల్లిన్‌లోని రష్యన్ నాటకశాలలో చేరవలసిందని ఆయనకు ఆహ్వానమొచ్చింది. ఒకనాడు సాయంత్రం, యీ నాటకశాల జరిపిన ఒకానొక ప్రదర్శనలో ఒలెగ్ ఒక ముఖ్య పాత్రను నటిస్తూండగా "*గాడ్‌ఫ్లయ్*" నిర్మాతలలో ఒకాయన తొలిసారిగా అతనిని చూశారు. ఈ సినీమాలో నటించవలసిందనే ఆహ్వానాన్ని అందుకుని ఆనందభరితుడై యీ యువనటుడు చివరికి తన సినీమా కళోపాసన ప్రారంభించేరు. "*గాడ్‌ఫ్లయ్*" తరవాత స్ట్రిజనోవ్, జాక్ లండన్ వ్రాసిన ప్రఖ్యాత కథానిక ఆధారంగా వ్లాదిమిర్ కప్లునోవ్‌స్కీ నిర్మించిన "*ది మెక్సికన్*" చిత్రంలో రివెరా అనే పాత్ర ధరించాడు. ఈ పాత్ర నటించడానికి స్ట్రిజెనోవ్ ఎంతో నైపుణ్యంతో యింకొక దేశపు మనిషిగా మారడమేకాక అంతకంటె ఎక్కువగానే కృషి చేయవలసి వచ్చింది.



అఫనసీ నికితిన్ పాత్రధరించిన ఒలెగ్ స్ట్రిజెనోవ్

## ప్రతిభావంతుడైన నటుడు

"*అఫనసీ నికితిన్*"కు ముందు ఒలెగ్ స్ట్రిజెనోవ్, గ్రిగొరీ చుక్రాయ్ డైరెక్టు చేసిన "*నలభై ఒకటి*" అనే చిత్రంలో వైట్ ఆర్మీ ఆఫీసరు గోవోరుఖ-ఓత్రక్ పాత్ర నటించాడు. ఇందులో స్ట్రిజెనోవ్ నాయకుని మనోభావాలను నైపుణ్యంతో ప్రదర్శించారు. ఒక్కొక్కప్పుడు దృఢ చిత్తుడైన ప్రబల శత్రువూ, ధనిక వర్గీయుడుగా, ఒక్కొక్కప్పుడు మంచివాడుగా ప్వాప్నికుడూ, ప్రేమికుడుగా కనిపించే పాత్ర ప్రేక్షకులకు ప్రత్యక్షమయింది.

కేన్స్‌లో జరిగిన పదియవ అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో "*నలభై ఒకటి*" చిత్రానికి "ఇతివృత్తంలో నవ్యత్వమూ, మానవత్వం చక్కటి రొమాన్సు" వున్నందుకు ద్వితీయ బహుమానం లభించింది.

"*అఫనసీ నికితిన్*"గా ఒలెగ్ స్ట్రిజెనోవ్ వివేకవంతమైన చురుకైన నేత్రాలూ, చక్కటి గెడ్డం, విశాలమైన నుదురు, తేలికైన వంకు వంకుల జుట్టుగల రష్యన్ యాత్రికునిగా కనిపిస్తాడు. *యువకుడూ, ప్రతిభా వంతుడైన యీ నటుడు యీసారి కూడా తన అద్భుత విజయంతో తన సినిమా అభిమానులను ఆనందపర్చగలడని నమ్మవచ్చును.*

# నా విద్యాపరిషత్తు

## మురళి ఆర్. అచ్‌రేకర్, ఫిల్మ్ సెటింగ్స్ ఆర్టిస్టు

రూపచిత్రాలను, ప్రకృతి దృశ్యాలను చిత్రించే చిత్రకారునిగా నేను కళాత్మక సంతృప్తిని అనుభవించాను. కాని సినిమా రంగంలో పనిచేస్తున్న కళాకారునిగా ఆ సంతృప్తిని నేను, కె. ఎ. అబ్బాస్ తాను సోవియట్ "మాస్‌ఫిలిమ్స్"స్టుడియో సహకారంతో తయారుచేస్తున్న "పరదేశి" చిత్ర నిర్మాణంలో పాల్గొనమన్నప్పుడు పొందాను. అప్పట్లో నాకు "మాస్ ఫిలిమ్స్" స్టుడియోలో భారతీయ శిల్ప కళతో కూడిన ఒక దృశ్యాన్ని నిర్మించడానికి సోవియట్ దేశం నేను వెళ్ళవలసి వస్తుందన్న విషయం తెలియదు.

నా కృషి విజయవంతమవుతుందని మొదట్లో నాకు గట్టినమ్మకం ఉండేది కాదు. కాని నేను మాస్కోకుచేరి "మాస్ ఫిలిమ్స్" శిల్పకళాశాఖలో పనిచేయడం ప్రారంభించిన తర్వాత ఫిలిమ్ సెట్టింగులు తయారుచేసే కళాకారునిగా నేను అనుకున్నదానికంటే యెక్కువ విజయవంతంగా పనిచేయగలనని పించింది. ఈ విజయానికంతటికీ "మాస్ ఫిలిమ్స్" స్టుడియో ఉద్యోగులు నాకిచ్చిన సహకారానికి నేనెంతో ఋణపడి వున్నానని చెప్పక తప్పదు.

వారి తీవ్రమైన కృషి, ఉన్నత తరగతికి చెందిన వారి పని, సహాయం చేయడానికి వారి సంసిద్ధత నన్ను యెంతగానో ఆకర్షించాయి. నేను చిత్రించిన దృశ్యాన్ని "మాస్ ఫిలిమ్స్" స్టుడియో కార్మికులు యెంత నైపుణ్యంతో సెట్టుగా తయారు చేసారో చెప్పడం నాకు అలవిగావడం లేదు. సోవియట్ కార్మికులు ఆ దృశ్యాన్ని యేమాత్రము తీరుపోకుండా నిర్మించగలగడం చూస్తే నాకు మహదాశ్చర్యం కలిగింది. వారికి నాజోహార్లు.

"పరదేశి" జట్టుతో "మాస్ ఫిలిమ్స్" స్టుడియోలో పనిచేస్తున్నప్పుడు అక్కడ నాకు తటస్థపడిన వారందరూ ప్రాచ్య సంస్కృతి పట్లా, కళలపట్లా చూపిన ప్రేమని గమనిస్తుంటే నాకు యెంతో ఆనందం కలిగింది. అది పట్టినే కనబర్చే ప్రేమకాదు. ఇతరుల సంస్కృతిని గురించీ, కళలనుగురించీ సాధ్యమైనంత తెలుసుకోవాలన్న ఆపేక్ష దానిలో కనబడుతుంది. ఇతర విషయాలను గురించి తెలుసుకోవాలన్నది సోవియట్ ప్రజలందరిలోను వున్న ఒక అద్భుతమైన విశిష్ట లక్షణం.

భారతీయ చలనచిత్ర పరిశ్రమలో సెట్టింగులను డిజైను చేయడానికీ, నిర్మించడానికీ మనకు శిక్షణను పొంది యోగ్యత సంపాదించుకొన్న కళాకారులుగాని, వాస్తుశిల్పులు గాని లేరు. సోవియట్ దేశంలో బాధ్యతాయుతమైన యేసంస్థకైనాసరే, కళాశాల విద్యాభ్యాసాన్నీ, అవసరమైన శిక్షణను పొందిన కళాకారులు, వాస్తుశిల్పులు వుంటారు. "మాస్ ఫిలిమ్స్" స్టుడియోలో నేను చేసిన పని నాకు ఒక విద్యాపరిషత్తు శిక్షణగా తోడ్పడింది.

"పరదేశి" ఫిలిమ్ యొక్క ప్రధాన కళాకారునిగా నేను "మాస్ ఫిలిమ్స్"లో పొందిన మహత్తరానుభవాలు యావత్తు భారత చలన చిత్ర పరిశ్రమకు లాభదాయకం కాగలవని గట్టిగా నమ్ముతున్నాను.

భారత, సోవియట్ సినిమా కార్మికుల మైత్రి సదా వర్ధిల్లుగాక!

✶

'పరదేశి' చిత్రంలోని ఒక దృశ్యం





# ఉరల్స్ గుండా



ఐ. అగ్రనోవస్కీ, వి. పొల్యానిన్

ఉత్తర దిశకు ప్రయాణం చేయసాగాము. రోడ్డు నున్నగా, అంబువలె తిన్నగా ఉన్నది. ఉరల్స్ పర్వత శ్రేణులు వాటి మధ్యప్రాంతంలో చాలా తక్కువ ఎత్తులో ఉంటాయి. మియాస్ నుండి చెల్యాబిన్స్క్‌కు పోయే రోడ్డు అసలు పర్వత ప్రాంతపు రోడ్డువలెనే కనుపించదు. చదునుగా వున్న ఆ ప్రాంతంగుండా ప్రయాణం చేస్తుంటే మాకు విసుగుపుట్టసాగింది. అందువల్ల పాత గైడ్‌బుక్ (యాత్రికులకు స్థలాలనుగురించి వివరించే పుస్తకం) తీసి చూడడం మొదలుపెట్టాము.

నలభై సంవత్సరాలకు కొద్దిగా పూర్వం చెల్యాబిన్స్క్ యీ విధంగా వర్ణింపబడింది:

చెల్యాబిన్స్క్ ఓరెన్‌బర్గ్ ప్రాంతంలోని ఒక వాణిజ్య పట్టణం. జనాభా 30,000. పరిశ్రమలు అభివృద్ధిని పొందలేదు, స్టాల్ ఎండ్ కంపెనీ అనే విదేశీ వ్యాపార సంస్థకుచెందిన నాగళ్ళను తయారుచేసే ఒక యంత్రాగారం మాత్రం వున్నది. ఎనిమిది విద్యాసంస్థలున్నాయి. అందులో కొన్ని మతగురువుల ఆధ్వర్యంలో నడుస్తున్నాయి. రెండు హాస్పటళ్ళు, పది చర్చీలు ఉన్నాయి.

చెల్యాబిన్స్క్‌లోని ఒక నాటక ప్రదర్శనశాల (పైన)

మా విలేఖరులు ఉరల్స్‌లో పర్యటించిన సందర్భంలో వ్రాసిన రెండవ వ్యాసం యిది. మొదటి వ్యాసం "సోవియట్ భూమి" 23వ సంచికలో ప్రకటింపబడింది

ఇది వ్రాసిన తర్వాత నలభై సంవత్సరాలు గడిచిపోయాయి. నేడు దాని జనాభా 600,000 మించి పోయింది. అదిప్పుడు చిన్న పట్టణం కాదు. ఒక పెద్ద మండలానికి కేంద్రంగా ఉంటున్నది. ఉరల్స్ ప్రాంతంలో రెండవ పెద్ద నగరంగా వర్ధిల్లుతున్నది. ఈ నగరంలో అనేక యంత్రాగారాలు ఉన్నాయి. చెల్యాబిన్స్క్ ట్రాక్టర్ల యంత్రాగారం, చెల్యాబిన్స్క్ ఇనుము, ఉక్కు యంత్రాగారం, ఇనుము మిశ్రమలోహ యంత్రాగారం, ట్యూబ్ యంత్రాగారం వాటిలో ముఖ్యమైనవి. నాలుగు ఉన్నత విద్యాసంస్థలు, ప్రవీణులకు శిక్షణ నిచ్చే పదమూడు సెకెండరీ పాఠశాలలూ, 111 దశ-వర్ష పాఠశాలలూ ఉన్నాయి. 1957 నాటికి విద్యార్థుల సంఖ్య 1917 నాటి మొత్తం జనాభాకు మూడురెట్లయింది.

మొత్తం ఉత్పత్తి విషయంలో రష్యన్ సమాఖ్యలోని ఇతర మూడు ఆర్థిక ప్రాంతాలు — మాస్కో, లెనిన్‌గ్రాడ్, స్వెర్డ్లోవ్స్క్‌ల తర్వాతి స్థానాన్ని అలంకరించే చెల్యాబిన్స్క్ ఆర్థిక నిర్వాహక ప్రాంతం యొక్క పారిశ్రామిక శక్తి మాకు ఆ నగరంలో ఉండగా రుజువయింది. సోవియట్ దేశంలో ఉత్పత్తి అయ్యే మొత్తం లోహంలో నాల్గవవంతును ఆ నగరం ఉత్పత్తి చేస్తున్నది. ఉన్నత తరగతి ఉక్కును ఉత్పత్తిచేసే ముఖ్యప్రాంతం. బొగ్గు, రాగి,



స్వెర్డ్లోవ్స్క్‌లోని ఒకచౌకు →

నికల్, మాగ్నిసైట్, టిటానియం—మాగ్నిటైటిస్, బంగారం, గ్రానైట్, భాస్వరం మొదలైన వాటిని కూడా ఉత్పత్తి చేస్తుంది. 120 కిలోమీటర్ల విస్తీర్ణంలో వ్యాపించివున్న బ్రహ్మాండమైన బొగ్గు గనులు నగరానికి సరిగ్గా ప్రక్కనే వున్నాయి. గత సంవత్సరం రెండుకోట్ల టన్నుల బొగ్గు తీయబడింది. ఇది విప్లవానికి పూర్వం కంటె 160 రెట్లు అధికం.

చెల్యాబిన్స్క్ ట్రాక్టర్ల యంత్రాగారంలో తయారుచేయబడిన ఒక శక్తివంతమైన కొత్త ట్రాక్టర్ నగరం బయట పరిశీలనార్థం ఉపయోగింపబడుతుంటే మేము చూచాము. 250 హార్స్ పవర్ గల ట్రాక్టర్. అది హాలర్‌గాను, స్క్రేపర్‌గాను, బుల్‌డోజర్‌గాను, చివరికి విద్యుత్ కేంద్రంగా కూడా ఉపయోగింపబడగలదు. "చెల్యాబిన్స్క్ ట్రాక్టర్ల యంత్రాగారం" నామాన్ని సూచించే "సి. హెచ్. టి. జడ్" అన్న ట్రేడ్‌మార్కు సోవియట్ దేశంలోనేగాక మొత్తం ఆరు ఖండాలలోను ప్రసిద్ధి గాంచింది. "ఆరు" ఖండాలంటున్నా మందే అందులో పొరపాటేమి లేదు, ఎందువల్లనంటే "సి. హెచ్. టి. జడ్" ట్రాక్టర్లు దక్షిణ ధృవప్రాంతంలో గూడా వినియోగింపబడుతున్నాయి. 100 హార్స్ పవర్‌గల "సి. హెచ్. టి. జడ్" ట్రాక్టర్లు కొన్ని యీ మధ్యనే భారత దేశానికి పంపించబడ్డాయి.

నలభై సంవత్సరాలక్రితం చెల్యాబిన్స్క్ ప్రజలు తమ సాంస్కృతిక జీవితం విషయంలో, పట్టణంలోని ఒక చిన్న నాటకశాలతోనూ, ఊరూరు తిరుగుతూ వ్యాయామకళను ప్రదర్శించేవారి ప్రదర్శనలతోను, బజార్లలో జిప్సీలు ఎలుగుబంట్లతో ఆడించే ఆటలతోను సంతృప్తిపడవలసి వస్తూవుండేది. ఈనాడు చెల్యాబిన్స్క్ నగరం మధ్య ఉన్న చౌకు ఒక అద్భుతమయిన సంగీత నాటకశాలతో అలారుతున్నది. చెల్యాబిన్స్క్ సంగీత, నృత్యనాటక సమాజం అందులో చక్కని ప్రదర్శనలను ఇస్తున్నది. దానికి సమీపంలోనే ఒక నాటకశాల, కొన్ని సినిమాహాళ్లు, క్లబ్బులు ఉన్నాయి. ప్రతి పెద్ద యంత్రాగారానికి సాంస్కృతిక భవనాలున్నాయి.

## "సబంతుయి" పండుగ

మేము అక్కడినుండి బయలుదేరడానికి నిశ్చయించుకొన్న ఆదివారంనాడు స్టేడియంలో ఒక ఆసక్తిదాయకమైన ఉత్సవం జరిగింది.

"సబంతుయి" అనేది తార్తారు, బష్కీర్‌కు సంబంధించిన జాతీయక్రీడల పండుగ. ఆ రోజున చెల్యాబిన్స్క్ నగరం యొక్క స్టేడియంలో ఆ పండుగను చూచే అదృష్టం మాకు కలిగింది.

కొన్నివేల జనం ఫుట్‌బాల్ ఆటల మైదానం చుట్టూ చేరారు. మస్తాదులు కుస్తీపట్టడానికి మధ్య ప్రత్యేకించిన స్థలంపైన కేన్వాస్ పందిరి వేయబడింది. ఆ పోటీల్లో ఇష్టం వున్న వాళ్ళెవరైనాసరే వెళ్ళి పాల్గొనడానికి హక్కు ఉంటుంది. ప్రత్యర్థులిద్దరూ తుండుగుడ్డల సహాయంతో ఒకరి నడుమును మరొకరు



చెల్యాబిన్స్క్ కర్మాగారంలో తయారుచేయబడిన 250 అశ్వక శక్తి కలిగిన కొత్త రకపు ట్రాక్టర్

★

సబన్‌తూయ్‌లో (ఉత్సవాలు) జరిగిన జాతీయ కుస్తీ దృశ్యం





←ఉరల్ ఇంజినీరింగ్ కర్మాగారానికి చెందిన కొత్తఎక్స్కవేటర్ సమూనాల షాపులో యించుమించుగా అంతా భారత దేశానికి పంపవలసిన యంత్రాల ఉత్పత్తి జరుగుతున్నది

పట్టుకొంటూరు. తన ప్రత్యర్థిని వెల్లికలా పడవేయగలిగినవాడే విజేత అవుతాడు. ఈ సందర్భంలో పరుగుపోటీలుగూడా జరిగాయి. పరుగు పోటీలో అందరికంటే ముందు రావడమేగా. ప్రతి పరుగు పోటీదారునికి అదనంగా నిర్దేశింపబడిన పనిలో మెలుకువను చూపిన వాడే నెగ్గినట్లు గుర్తింపబడుతుంది. ప్రతి పోటీదారుడు ఒక కోడి గుడ్డును ఉంచిన చెంచాను నోట్లో ఉంచుకొని మరీ పరుగెత్తాలి. పోటీల్లో గెలిచినవారందరికి సిగరెట్ కేసులు, గడియారాలు మొదలైనటువంటి విలువైన బహుమానాలివ్వబడ్డాయి. పిల్లలకు బొమ్మలు, పెద్దలకు పుస్తకాలు, యువతులకు సెంట్లు గూడా బహుమతులుగా ఇవ్వబడ్డాయి.



దీనిమీది వ్రాతనుబట్టి యీ యంత్ర సామగ్రి భారత దేశానికి పంపబడేదని తెలుస్తున్నది



## భారత మిత్రులు చూపే విశ్వాసానికి తగినట్లుగా మసులుకొంటాము

మేము ఇంకా ముందుకు పోసాగాము. ఉరల్స చిత్రపటంలో మేము వెళుతున్న మార్గం అంబువలె తిన్నగా ఉత్తరదిశకు పోతున్నది. ఈ ప్రాంతంలోని నిక్షేపాలు ఒక సరళరేఖలో ఉన్నట్లు చిత్రపటంలో కనబడుతుంది. ఉరల్స్‌లోని ముఖ్యమైన పట్టణాలు గూడా దక్షిణంనుండి ఉత్తరానికి సరళరేఖలో ఉన్నాయి. ఈ సరళ రేఖలో, సరిగ్గా మధ్యన, "శిలామండల"పు పెద్ద నగరాలలో ఒకటయిన "ఉరల్స రాజధాని" స్వెర్డ్లోవ్స్క్ ఉన్నది.

సోవియట్ దేశం స్వెర్డ్లోవ్స్క్‌కు యే విషయాలలో రుణపడివున్నదో కొద్దిలో చెప్పడం సాధ్యమయేవిషయంకాదు : ప్రముఖ విప్లవకారులు, విజ్ఞానశాస్త్రవేత్తలు, చెస్ చాంపియన్‌లు, రచయితలు ఆ నగరంలో పుట్టారు. బ్రహ్మాండమయిన యంత్రాగారాలు, అపురూపమయిన యంత్రాలు నిర్మింపబడ్డాయి. ఈ నగరం దాని ఆధునిక ఇంజినీరింగ్ విజయాలకూ, అందమైన ప్రాచీనకట్టడాలకూ

←ఈ యంత్రాలు భారత దేశానికి పోతున్నాయి

పేరుబడ్డవి. ఉరల్స్‌కు సంబంధించిన విశిష్ట విషయాలన్నీ అక్కడ ఉన్నాయని చెప్పవచ్చును. ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన వజ్ర వైఢూర్యాలుగల భూగర్భ వస్తువుల మూజియం, భారీయంత్రాలను తయారు చేసే "ఉరల్‌మష్"అనే బ్రహ్మాండమైన యంత్రాగారము మొదలైనవి యెన్నెన్నో ఇక్కడ ఉన్నాయి.

సోవియట్ దేశంలో "ఉరల్‌మష్"యంత్రాగారల యంత్రాగారమని పిలవబడుతుంది. బ్రహ్మాండమైన యంత్రాగారాలు యిక్కడ డిజైను చేయబడి నిర్మింపబడుతుంటాయి. డ్రిల్లింగు యంత్రాలు 25 ఘన పరిమాణపు మీటర్ల స్కూపులూ, సంవత్సరానికి యాభై లక్షల ఘన పరిమాణపు మీటర్ల ఉత్పాదన శక్తిగల బ్రహ్మాండమైన నడిచే ఎక్స్‌పేటర్లూ ఇక్కడ తయారు చేయబడుతున్నాయి. ఎక్స్‌ప్రెస్ రైలుబండి వేగంతో ఉక్కు చట్టాలు దొర్లిపోతూ ఉండే రోలర్లను, వేనకువేల టన్నుల వత్తిడి శక్తిగల ప్రెస్సులనూ కలిగిఉన్న రోలర్ యంత్రాలు ఇక్కడే నిర్మింపబడుతున్నాయి.

చాలా సేపటివరకూ మేము ఆ యంత్రాగారపు షాపులన్నీ చూస్తూ తిరిగాము. ప్రతిచోట యంత్రాలకు, ఎర్రనిరంగు వేయబడి ఉండడం మమ్మల్ని ఆకర్షించింది.

"ఎందుకిలాంటి యెర్రని రంగు వేశారు?"అని మేము అడిగాము.

"అది వట్టి యెర్రరంగుకాదు. ఉష్ణప్రాంతపు పరిస్థితుల్లో వస్తువుల క్షయాన్ని అరికట్టేందుకు ఒక రక్షణోపాయంగా ఆ యెర్రని పూత ఉపయోగింపబడుతున్నది," అని ఇంజినీర్లు సమాధానం చెప్పారు.



కరిగిన ఉక్కు

"అంటే, మీరనడం ఇన్ని స్కూపులు, బ్లాస్ట్ ఫర్నేస్‌లకు సంబంధించిన యంత్రపరికరాలు, రోలింగుయంత్రాలు ఉష్ణప్రాంతాలకు పంపబడుతున్నాయనేనా ?"

"ఒకసారి ఆ యంత్రాలు పెట్టి బిగించిన పెట్టెలమీద చూడండి,"అన్నారు వాళ్ళు.

ఆ పెట్టెలమీద ఉన్న వ్రాతలనన్నింటినీ మేము యేకరువు పెట్టబోవడం లేదు. కాని పాఠకుడు ఒకసారి ఇక్కడి బొమ్మను చూచే శ్రమ తీసుకొంటే చాలు. భిలాయ్ యంత్రాగారం అన్న అడ్రస్ అన్ని విషయాలనూ వివరిస్తుంది.

భారత దేశం యంత్రాలకొరకు ఇచ్చిన ఆర్డరు ప్రకారం యంత్రాలను తయారుచేసి సాధ్యమైనంతత్వరగా సరఫరా చేయడానికి ఉరల్‌మష్ కార్మికులూ, ఇంజినీర్లూ యెంతో శ్రమపడుతూ చురుకుగా పనిచేస్తున్నారు. యంత్రాలను ఇన్సులేటింగ్ కాగితం వేసి జాగ్రత్తగా పెట్టెలలో బిగించడమూ, యెంతో శ్రద్ధతో రంగులను వేస్తుండడమూ మేము స్వయంగా చూచాము.

"భారత దేశం నుండి మాకు వచ్చిన యీ ఆర్డర్‌ను అనుకున్న సమయానికంటే ముందే సరఫరా చేస్తున్నామ"ని ఎసెంబ్లింగ్ షాపు ఫోర్మెన్ మిఖైల్ సొలొతుబోవ్ అన్నారు. "భారత ప్రధాని నెహ్రూ మా యంత్రాగారాన్ని సందర్శించినప్పుడు, భారత దేశం కొరకు యింతగా పాటుపడుతున్న మా యంత్రాగారంపట్ల తనకు వ్యక్తిగత ఆసక్తి ఉన్నదని అన్నారు. అవును, ఇందులో కోట్లాది భారతీయ ప్రజల 'వ్యక్తిగత ఆసక్తి', మాయొక్క సౌభ్రాతృత్వపు 'వ్యక్తిగత ఆసక్తి' ఇమిడి ఉన్నాయి."

(సశేషం)

# సృజనాత్మక కృషిలో

రెండేళ్ళ క్రితం భిలాయ్ చిన్న గ్రామంగా, జిల్లాకు వెలుపల ఎవరికీ తెలియకుండా, మధ్య ప్రదేశ్ దక్షిణ భాగంలో ఎక్కడో పడివుండేది. కాని యిప్పుడు భిలాయ్ ఒక పెద్ద లోహ పరిశ్రమ నిర్మాణ స్థలంగా, భారీ పరిశ్రమ నిర్మాణానికి స్వతంత్ర భారతదేశ కార్యక్రమంలోని తొలి పరిశ్రమ నిర్మాణ స్థలంగా వుంది. నిర్మాణం అయిపోయాక ఒకటి రెండేళ్ళలో భిలాయ్ ఉక్కు పరిశ్రమ పది లక్షల టన్నుల ఉక్కును, లక్షల టన్నుల దుక్కి యినుమునూ—అంటే యిప్పుడు భారత దేశం అంతా ఉత్పత్తి చేస్తున్నంత యించుమించుగా—ఉత్పత్తి చేస్తుంది.

భిలాయ్ ఉక్కు పరిశ్రమ నిర్మాణంలో సోవియట్ దేశం పాల్గొంటూ వుంది. ఒడంబడిక షరతుల ప్రకారం పరిశ్రమ ప్రాజెక్టుకు తయారు చేయడమూ, అవసరమైన యాంత్ర సామగ్రినీ, వస్తువులనూ తయారుచేసి సరఫరా చేయడమూ, నిర్మాణం యొక్క సాంకేతిక నిర్వహణ, పర్యవేక్షణ, పరిశ్రమను పనిచేయించడంలో తోడుపడడమూ కూడా సోవియట్ దేశపు బాధ్యత.

సమానత్వం, జాతీయ సర్వ స్వతంత్రత పట్ల ఉభయత్రా గౌరవమూ పైని ఆధారపడింది, ఉక్కు పరిశ్రమ నిర్మాణం గురించి భారత-సోవియట్ ఒడంబడిక. ఈ ఒడంబడిక ప్రకారం భిలాయ్ పరిశ్రమకు అవసరమైన యంత్ర సామగ్రిలో కొంత భాగం, యంత్ర సామగ్రి భారతదేశ పరిశ్రమ సరఫరా చేస్తుంది నిర్మాణం ఖర్చులకు సోవియట్ దేశం భారత దేశానికి ఋణం యిస్తుందనీ, దానిని భారత దేశపు నాణేలలో సమానమైన పన్నెండు సాలు వాయిదాలలో, సాలుకు నూటికి రెండున్నర వడ్డీ చొప్పున తిరిగి చెల్లింపబడాలనీ అది నిర్ణయించింది.

భారతదేశ పారిశ్రామికీకరణకు సోవియట్ దేశం మన:పూర్వకంగా సాయపడుతోంది. ఒకటిన్నర నెలల క్రితం మాత్రమే, సోవియట్ దేశం భారత దేశానికి అతి అనుకూలమైన షరతుల పైని అరవై కోట్ల రూపాయల అప్పునిచ్చింది. ఈ అప్పు భారత దేశంలో ఒక భారి యంత్ర నిర్మాణ పరిశ్రమనూ, బొగ్గుగని యంత్ర పరిశ్రమనూ ఆప్టికల్ గాజు పరిశ్రమనూ, థెర్మల్ పవర్ స్టేషన్‌నూ, యింకా చాలా యితర పరిశ్రమలనూ, సోవియట్ దేశంలో భారతీయ సాంకేతిక సిబ్బంది శిక్షణ కొరకూ కూడా ఉపయోగింపబడుతుంది.



# సుస్నేహం

జి. కొచర్యాంత్స్

కోట్లాది టన్నుల లోహమూ, వేలాది వివిధ యంత్రాలూ, వివిధ సామగ్రి తయారుచేయడానికీ, భారత దేశ ఆర్థిక విధానాన్ని ఎక్కువగా పెంపొందించుకొనడానికీ, తమ ప్రజల జీవన ప్రమాణాన్ని హెచ్చించడానికీ, భారత ప్రజల అభిలాషను సోవియట్ ప్రజలు బాగా అవగాహన చేసుకున్నారు.

ముప్పయ్యేళ్ళ క్రితం సోవియట్ దేశంలో కూడా భారీ పరిశ్రమ పెంపొందలేదు గాబట్టి, సోవియట్ ప్రజలకు యిది సుగ్రాహ్యమే. అప్పుడు సోవియట్ దేశం యింకా కష్టతరమైన పరిస్థితిలో వుండేది. ఆ సంవత్సరాలలో సోవియట్ దేశం ఒంటరిగా వుండేది, ఎవ్వరూ ఆర్థిక సహాయం చేసేవారు లేరు దానికి. కాని సోవియట్ ప్రజలు దీక్షాబద్ధులై దేశ పారిశ్రామికీకరణకు పూనుకుని, కొంతకాలం వీరోచిత కృషి జరిపాక, మంచి విజయాలను సాధించారు. యుద్ధకాలంలో, యుద్ధానంతర పునర్నిర్మాణ కాలంతో బాటుగా గత ముప్పయ్యేళ్ళలో చాలా భారీ పరిశ్రమలతో బాటుగా రెండు లక్షల కొత్త ప్రభుత్వ పరిశ్రమలు సోవియట్ దేశంలో నిర్మింపబడ్డాయనీ, యిప్పుడొక లక్ష నిర్మాణంలో వున్నాయనీ చెపితే చాలు, అది సాధించిన విజయాలను సూచించేందుకు.

భిలాయ్‌లో ఒక భారతీయ యువక ఇంజినీరు చెప్పినట్టుగా భారత రిపబ్లిక్‌కు, భిలాయ్ ఇనుము ఉక్కు పరిశ్రమవంటి పారిశ్రామిక సంస్థలెన్నో అవసరం. అవి దేశాన్ని పరివర్తనం గావించేందుకు తోడ్పడతాయి. కాని యీ లక్ష్యాన్ని సాధించేందుకు భారత దేశానికి స్వీయ సాంకేతిక విషయజ్ఞులు అవసరమవుతుంది.

సోవియట్ ప్రజలు ఎందుకు తమ భారతీయ మిత్రులకు ఆత్రుతగా, ఉత్సాహంగా సహాయపడి, పారిశ్రామిక సంస్థలను నిర్మించడంలోనూ, నడపడంలోనూ తమకు గల గొప్ప అనుభవాన్ని అందజేస్తున్నారో యిదంతా తెలియజేస్తుంది. వారు తమ వైజ్ఞానిక, సాంకేతిక జ్ఞానాన్నంతట్నీ, ఉత్పత్తి రహస్యాలనబడేవాటినీ భారతదేశానికి యిస్తూ వుండడం యీ కారణం వల్లనే.

(మిగత 28వ పుటచూడండి)





# భారతదేశ పారిశ్రామికీకరణలో భిలాయ్ ఉక్కు పరిశ్రమ నిర్వహించనున్న మహత్తర పాత్ర

"సోవియట్ భూమి" విలేఖరుల బృందం ఇటీవల భిలాయ్‌లోని ఉక్కు పరిశ్రమాగారాన్ని సందర్శించింది. ఈ పర్యటనలో వారు, భిలాయ్ ఉక్కు పరిశ్రమాగారపు జనరల్ మేనేజర్, శ్రీ ఎస్.సి. శ్రీవాస్తవను కలుసుకొన్నారు. శ్రీవాస్తవను వారడిగిన ప్రశ్నలనూ, వాటికివ్వబడిన జవాబులనూ యీ దిగువ ఇస్తున్నాము

ప్రశ్న: దేశీయ ఆర్థిక. జీవిత రంగాలలో భిలాయ్‌లోని ఉక్కు పరిశ్రమాగారం ఎటువంటి స్థానాన్ని ఆక్రమించగలదో దయచేసి వివరిస్తారా?

జవాబు: ఉక్కు కర్మాగారాలు పంచవర్ష ప్రణాళికకు హృదయం లాంటివి. ఇంతవరకూ ఉక్కు ఉత్పత్తి, ఈ దేశంలో చాలా తక్కువ స్థాయిలో ఉన్నది. పారిశ్రామికీకరణానికి ప్రప్రథమ సోపానంగా భిలాయ్ ఎంతో ప్రధాన పాత్రవహించి, ప్రముఖ స్థానాన్ని పొందనున్నది.

ఉక్కు పరిశ్రమాగార స్థావరమైన యీ ప్రాంతం, ఎంతో వెనుకబడిన అభివృద్ధి చెందని ప్రాంతం. ఇంతవరకూ ఇక్కడ వరిమాత్రమే పండించబడుతున్నది. ఉక్కు పరిశ్రమాగారం నెలకొనడంతో యీ ప్రాంతపు రంగు పూర్తిగా మారిపోతుంది. వ్యవసాయ ప్రాంతమల్లా పారిశ్రామిక ప్రాంతంగా మారిపోతుంది.

50 మైళ్ళ దూరంలో ఇనుపగనులున్నాయి, వాటిని యాంత్రికీకృతం చెయ్యడానికి రష్యానుంచి యంత్రాలను తెప్పించుకొంటున్నాము. రాజ్‌హరా-పహార్, ఇనుపగనులున్న ప్రాంతం, యీ ప్రాంతంకన్నా ఎంతో వెనుక ప్రాంతం ఆ ప్రాంతం కూడా ఆర్థికంగా పరివర్తన చెందబోతున్నది.

(మిగతా 26వ పుటలో)

*

శ్రీ ఎస్. సి. శ్రీవాస్తవ, భిలాయ్ పరిశ్రమ జనరల్ మేనేజర్



## యథార్థాలూ, అంకెలూ

* భిలాయ్ నిర్మాణ స్థావరంలో త్రవ్వకమవుతున్న మట్టినంతట్నీ రవాణా చెయ్యాలంటే, ఒక్కొక్క దానికి 24 టన్నుల పరిమాణం కలిగిన 310,000 రైల్వే వాగన్లు నెక్కించాలి. వీటన్నింటినీ కలిపినట్టయితే ఆ రైలు. బొంబాయినుంచి కలకత్తాకున్నంత దూరపు మేరను ఆక్రమించుకొంటుంది

భిలాయ్ ఇనుము, ఉక్కు పరిశ్రమాగారం వద్ద వివిధాలైన 5,000 ఎలక్ట్రిక్ మోటార్లు అమర్చబడుతున్నాయి.

ప్రతిరోజూ భిలాయ్ కర్మాగారానికి 5,100 టన్నుల బొగ్గు, 5,300 టన్నుల ముడి ఇనుము, 2 400 టన్నుల సున్నపురాయి కరిగిన సున్నమూ, 550 టన్నుల ఇతర సామగ్రి వస్తున్నాయి

* ఏడాదికి భిలాయ్ ఇనుము, ఉక్కు పరిశ్రమాగారం—770,000 టన్నుల లోహపు చుట్టలు, కడ్డీలు వగైరా ఉత్పత్తి చేస్తుంది. దానితో ·

11,000 రైలింజన్లను, లేక

51,300 20-టన్నుల రైలు పెట్టెలను లేక

77 000 ట్రాక్టర్లను తయారు చెయ్యవచ్చు.

* భిలాయ్ ఇనుము, ఉక్కు పరిశ్రమాగారం, ఏడాదిలో ఉత్పత్తి చేసిన లోహంతో 1 000 కిలోమీటర్ల రైలు మార్గాన్ని నిర్మించవచ్చు

* భిలాయ్ నిర్మాణంలో ప్రస్తుతం 26 000 మంది పనిచేస్తున్నారు పని ప్రారంభంకాగానే ఇది 7,300 మందికి ఉద్యోగ కల్పన చెయ్యగలుగుతుంది. వీరిలో—925 ఇంజనీర్లు, సాంకేతిక నిపుణులు; 5 935 నిపుణులైన కార్మికులు, 316 కార్యాలయోద్యోగులు, 124 జూనియర్ మెయిన్టెనెన్స్ స్టాఫ్.

* సోవియట్ దేశం భిలాయ్‌కి సరఫరా చేస్తున్న సామగ్రి మొత్తం 100,000 టన్నులు. వీటిలో ఒక బ్లూమింగ్ మిల్లు ధారావాహికంగా పనిచేసే బిలెట్ మిల్లు. రెయిల్ అండ్ స్ట్రక్చరల్ స్టీల్ మిల్లు ప్రొఫైల్డ్ అయిరన్ మిల్లు, శక్తివంతమైన గోపురపు వంతెన క్రేన్లు క్రమానుసారంగా 125 75, 50, 30 టన్నుల పైకెత్తగలిగిన శక్తి గలిగినవి, స్టీమ్ బాయిలర్లు రిక్యూపరేటివ్ బాయిలర్లు ఉన్నాయి.

ఇవిగాక, నిర్మాణ స్థావరానికి 120,000 టన్నుల రిఫ్రాక్టరీ సామగ్రి; 18,000 టన్నుల ఉక్కు, ముడిఇనుము గొట్టాలు 73,000 టన్నుల లోహకట్టడాలు సరఫరా అవుతాయి. వీటిలో చాలా భాగం ఇప్పటికే నిర్మాణ స్థావరానికి చేరవేయబడ్డాయి

ప్రక్క పుట చిత్రం: భిలాయ్‌లో నిర్మించబడుతున్న ఎయిర్ స్టౌవ్

నిర్మాణ స్థావరంవద్ద, సోవియట్, భారతీయ ఇంజనీర్లు బ్లాస్ట్ ఫర్నేస్ షాపుయొక్క నిర్మాణానికి సంబంధించిన సమస్యలను చర్చిస్తున్నారు.



రిఫ్రాక్టరీ కొరకు సోవియట్ దేశంనుంచి పెట్టెలకు పెట్టెలుగా వస్తున్న ఇసుకరాతి ఇటుకలు





# నెహ్రూ లేఖకు సోవియట్ ప్రభుత్వ ప్రశంస

అణ్వాయుధ పాటవ పరీక్షలు, అధికాయుధోత్పత్తి పోటీల విరమణ విషయమై సోవియట్ దేశ ప్రభుత్వానికీ, అమెరికా ప్రభుత్వానికి ప్రధాని నెహ్రూ చేసిన విజ్ఞప్తి పాఠాన్ని నవంబరు 28వ తేదీన భారత విదేశాంగ శాఖ భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయానికి అందజేసింది.

డిసెంబరు 10వ తేదీన, సోవియట్ దేశ మంత్రి మండలి అధ్యక్షుడు నికోలాయ్ బుల్గానిన్ ప్రధాని నెహ్రూకు జవాబు లేఖను పంపించారు.

శ్రీ నెహ్రూ చేసిన విజ్ఞప్తినీ, బుల్గానిన్ పంపిన జవాబునూ ఈ దిగువ నిస్తున్నాము.

## భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ సోవియట్ దేశ ప్రభుత్వానికీ, అమెరికన్ ప్రభుత్వానికీ చేసిన విజ్ఞప్తి

అమెరికా, సోవియట్ దేశాల మహా నాయకులకు విజ్ఞప్తి చేయడానికి నేను సాహసిస్తున్నాను. బహు నమ్రతతో, త్రికరణ శుద్ధితో ఇలా చేస్తున్నాను. భారత దేశంలో మాకు తీవ్రమైన సమస్యలున్నాయి. కాని ప్రపంచం యింతవరకు యెన్నడూ కనీ వినీ యెరుగని ప్రమాదం నాగరికతకు కలుగబోతున్న విషయాన్ని గురించి తలుచుకొన్నప్పుడు నాకు ఆందోళన కలుగుతున్నది.

ఈ ప్రమాదాన్ని అరికట్టి, మానవాళికి యెదురవుతున్న అంతిమ విపత్తునుండి దానిని కాపాడ గల శక్తి అమెరికా, రష్యాలకు వున్నదని నేను నమ్ముతున్నాను. మానవుడు అత్యున్నత స్థాయినందుకొన్న తన మేధస్సుతోను. విజ్ఞానంతోను రోదసిలోనికి చొరుచుకొనిపోయి ఆకాశంలోకి అధిగమిస్తున్న యీ సమయంలో ఆణ్వాయుధ యుగపు నూతన అస్త్రాలకు మన భూమండలం అతి చిన్నదై పోయింది. మానవజాతి అస్తిత్వానికే ప్రమాదం వాటిల్లుతున్నది. భూతలంమీది ప్రాణికోటినంతటిని అంతమొందించగలన్ని మూక ఉమ్మడిగా జన నిర్మూలనం గావించే ఆయుధాలు ఇప్పటికీ తయారయి ఉన్నాయి. ఈనాడు అవి అమెరికాకు, సోవియట్ దేశానికి సమృద్ధిగా వున్నాయి. బ్రిటన్‌కు కూడా వున్నాయి. ఇకముందవి యితర దేశాలకు కూడా లభించవచ్చు. అలాంటప్పుడు ఆ దేశాలను అదుపులో వుంచడం మానవ శక్తికి మించిన పనై పోతుంది. అణ్వాయుధ పాటవ పరీక్షలు జరుగుతూ వున్నాయి. గాలి, నీరు, ఆహారం కలుషితమైపోతున్నది. మానవాళియొక్క వర్తమాన, భవిష్యత్ తరాలకు హాని కలిగింపబడుతున్నది.

మూకవుమ్మడిగా ప్రజా వినాశనాన్ని గావించే ఆయుధోత్పత్తి పోటీ, ప్రచ్ఛన్న యుద్ధము ఇలాగే కొనసాగినట్లయితే యెంతటి శక్తివంతమైన దేశమైనా, ప్రజలైనా సురక్షితంగా వుండడం జరుగదు.

ముందు కనబడుతున్న యీ ప్రమాదాలేగాక, వేలాది సంవత్సరాల మానవ కృషితో నిర్మితమైన నాగరికత భయం, ద్వేషాలచేత క్షీణించి, క్రుంగిపోతున్నది. ఈ విధంగానే పరిస్థితులు యింకా కొనసాగినట్లయితే త్వరితగతిని నశించిపోతుంది.

ప్రపంచ ప్రజలందరికీ జీవించడానికీ, అభివృద్ధిని పొందడానికీ, తమ భవిష్యత్తును నిర్మించుకోడానికీ హక్కు వున్నది. శాంతి, భద్రతలకు హక్కు వున్నది. శాంతియుతంగా కలిసి జీవిస్తూ, తమ సమస్యలను శాంతియుత పద్ధతుల్లో పరిష్కరించు కొనగలిగినప్పుడే వారు యీ హక్కులను పరిరక్షించుకొనగలరు. మతాలు, నమ్మకాలు, సిద్ధాంతాల విషయంలో వారికి విభేదాలున్నాయి. బలవంతంగాగాని, బెదిరింపులతోగాని ఒకరినొకరు మార్చలేరు. ఎందువల్లనంటే,

అలాంటి ప్రయత్నాలు అందరి ప్రమాదానికి దారితీస్తాయి. కాబట్టి, విభేదాలు ఉన్నప్పటికి శాంతియుతంగా కలసి జీవిస్తూ, ద్వేషం, దౌర్జన్యాల విధానాన్ని విడనాడడం ఒక్కటే ఇప్పుడు ఉన్న మార్గం. నైతికంగా ఇది అవసరమవుతున్నది. కాని అంతకుమించి, ప్రత్యక్ష పరిస్థితుల దృష్ట్యా కూడా యిది అవసర మవుతున్నది.

ఇది సంభవం కాగలదనడంలో నాకు సందేహం లేదు. ప్రపంచంపైన ముంచుకువస్తూ మన మేధస్సులనూ, మన భవిష్యత్తునూ చీకటిమయం చేస్తున్న యీ భయంకర పరిస్థితిని అంతమొందించగల శక్తి అమెరికా, రష్యాలకు వున్నదన్న విషయంలో కూడా నాకు సందేహం లేదు.

పాశ్చాత్య పెట్టుబడిదారి విధానం అనబడేదానిలో లక్షలాది మందికి నమ్మకం వున్నది, కమ్యూనిజంలో గూడా లక్షలాది మందికి నమ్మకంవున్నది. కాని యీ రెండు సిద్ధాంతాలలో దేనికీ చెందక, మంచి జీవితంకొరకూ, మరింత నమ్మకమైన భవిష్యత్తుకొరకూ యితరులతో స్నేహంగా ఉండదలచుకొన్నవారు అనేక లక్షలమంది ఉన్నారు.

నేను నా తరపుననే మాట్లాడుతున్నాను. కాని నా దేశంలోని, ప్రపంచంలోని యితర దేశాల్లోని బహుళ సంఖ్యాకుల మనస్సులలోని విషయాన్ని కూడా వెల్లడిస్తున్నానని నా నమ్మకం, అందువల్ల, యీ ప్రపంచాన్ని కనీ వినీ యెరుగనటువంటి మహోన్నత స్థాయికి తీసుకొని పోగల శక్తినీ, లేదా దానిని మహా విపత్తులనేటి అగాధంలోకి త్రోసివేయగల శక్తినీ కూడా విధి తమ చేతులలో పెట్టిన అమెరికా, రష్యాల మహానాయకులకు యీ విజ్ఞప్తిని చేయడానికి నేను సాహసిస్తున్నాను.

సమస్త అణ్వాయుధ పాటవ పరీక్షలను ఆపివేసి తద్వారా యీ పీడను అంతమొందించడానికి తాము కృతనిశ్చయులమై వున్నామని ప్రపంచానికి చాటి, సమర్థవంతమైన నిరాయుధీకరణకొరకు చర్యలను గైకొనవలని వారికి నేను విజ్ఞప్తి చేస్తున్నాను.

ఇది జరిగిన వెంటనే మానవుని మనస్సులోని ఆందోళన తొలగిపోతుంది. కాని అవసరమైనది కేవలం భౌతికమైన మార్పు మాత్రమే కాదు. భయాన్ని తొలగించి, మానవజాతి అస్తిత్వానికి ప్రమాదం కలిగిస్తున్న ప్రమాదకర ధోరణిని అరికట్టడం కూడా అవసరం. స్వయంగా ఒకరితో మరొకరు సంబంధాలు కల్పించుకొని శాంతియుత పద్ధతులద్వారా ఒడంబడికలను జరుపుకొన్నప్పుడు మాత్రమే యీ సమస్యలు పరిష్కారమవుతాయి.

(సంతకం) జవహర్‌లాల్ నెహ్రూ
ఢిల్లీ, నవంబరు 28, 1957.

# సోవియట్ దేశ మంత్రి మండలి అధ్యక్షుడు నికొలాయ్ బుల్గానిన్ భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూకు వ్రాసిన లేఖ

గౌరవనీయ ప్రధాన మంత్రీ,

అమెరికా ప్రభుత్వానికీ, సోవియట్ ప్రభుత్వానికీ మీరు నవంబరు 28వ తేదీన చేసిన విజ్ఞప్తిని సోవియట్ ప్రభుత్వము అతి శ్రద్ధతోను, సానుభూతితోను పరిశీలించింది. అధికాయుధోత్పత్తి పోటీని, ప్రచ్ఛన్న యుద్ధాన్ని అంతమొందించమనీ, శాంతియుత సహజీవనాన్ని అవలంబించి వివాదాస్పద సమస్యలను శాంతియుత మార్గంలో పరిష్కరించుకొనే విధానాన్ని చేపట్టమనీ మీరు చేసిన విజ్ఞప్తిలో గల మహోన్నత భావాలను మేము పరిపూర్ణంగా అవగాహన చేసుకొంటున్నామని నేను యెంతో సంతృప్తితో తెలియజేస్తున్నాను.

మానవాళి భవిష్యత్తును గురించి మీరు వెళ్ళబుచ్చిన ఆందోళన మాకు బాగా అర్థమయింది. మీ విజ్ఞప్తిలో శాంతి పరిరక్షణ విషయమై కనబడుతున్న కృషిని మేము అవగాహన చేసుకొని, గౌరవిస్తున్నాము. సోవియట్ దేశ విదేశాంగ విధానం శాంతి విధానమే గాబట్టి ముఖ్యంగా అలా అర్థంచేసుకొనగలుగుతున్నాము. ఈ విధానము యే విధంగా ఉత్సాహంతోను, హృదయపూర్వకంగాను సమస్త సోవియట్ ప్రజలచేత బలపర్చబడుతున్నదో ప్రసిద్ధమైన తమ సోవియట్ దేశ పర్యటన సందర్భంలో స్వయంగా మీరే చూచారు.

1955లో మాస్కోలోను, ఢిల్లీలోను మనము గావించిన సంయుక్త ప్రకటనలో వ్యక్తంచేయబడినట్టి శాంతియుత సహజీవనావశ్యకత విషయానికి సంబంధించిన మన భావాలు ఒకటిగానే ఉన్నవని తెలుసుకొని మేము ఆనందపడుతున్నాము. ఈ విషయంలో మన భావాలు ఒక్కటేనన్న సంగతి మన కాలపు

ముఖ్యమైన సమస్యలపైన సోవియట్ దేశ ప్రభుత్వమూ, భారత ప్రభుత్వమూ చేసిన ప్రతిపాదనలే వ్యక్తం చేస్తున్నాయి.

అణ్వాయుధాలు అభివృద్ధి గావింపబడడమూ, అధికాయుధోత్పత్తి పోటీ యింకా కొనసాగడము లక్షలాది మానవులకు, మానవాళి కృషి ప్రతిఫలచేత సృష్టింపబడిన భౌతిక, సాంస్కృతిక విలువలకు నిర్మూలనా ప్రమాదాన్ని కల్పిస్తున్నాయని మీరు చక్కగా వివరించారు.

ప్రధాన మంత్రీ, అణు, ఉదజని ఆయుధాల నిషేధానికి సంబంధించిన సమస్యలపై సోవియట్ ప్రభుత్వం యొక్క దృక్పథమేమిటో మీకు బాగా తెలుసు.

మొత్తంమీద నిరాయుధీకరణ సమస్య పరిష్కారానికీ, అంతర్జాతీయ సంబంధాలలో భయాన్నీ, అవిశ్వాసాన్నీ తొలగించడానికీ, సుస్థిరమైన ప్రపంచశాంతిని కల్పించడానికి అణ్వాయుధ పాటవ పరీక్షల తక్షణ విరమణ ఒకముఖ్యమైన చర్య అని మా ప్రభుత్వం మీవలెనే పరిగణిస్తున్నదని మాత్రం ఇక్కడ నొక్కిచెప్ప దలుచుకొన్నాను.

అందువల్లనే సోవియట్ ప్రభుత్వం, జనరల్ ఎసెంబ్లీ ఇప్పటి సమావేశంలో నిరాయుధీకరణ విషయాన్ని గురించి చేసిన తన ప్రతిపాదనలలో, మొదటి మెట్టుగా, రెండుమూడు సంవత్సరాలకొరకైనాసరే, అణు, ఉదజని ఆయుధ పాటవ పరీక్షల నిలుపుదలపై ఒక ఒడంబడికను చేసుకొందామని తెలిపింది. అందరికీ అంగీకారయోగ్యమైన ఒడంబడికను సాధించాలన్న ఉద్దేశ్యంతో, అణ్వాయుధ పాటవ పరీక్షల నిలుపుదలపై ఒడంబడికకు, యితర నిరాయుధీకరణ సమస్యల పరిష్కారం షరతుగా పెట్టబడరాదంటూ మేము కోరాము. ఈ చర్య న్యాయమైనదనీ, పూర్తిగా ఆచరణయోగ్యమైనదనీ మీరు అంగీకరిస్తారని నేను నమ్ముతున్నాను. ఎప్పుడైనాసరే, అలాంటి ఒడంబడికపై సంతకం పెట్టడానికి మేము సిద్ధంగా ఉన్నాము.

దురదృష్టవశాత్తు కొన్ని పాశ్చాత్య రాజ్యాలు పాటవ పరీక్షల విరమణపై భారతదేశం ప్రతిపాదించిన ముసాయిదా తీర్మానాన్ని అంగీకరించనట్లుగానే మా ప్రతిపాదనలకు గూడా అంగీకరించలేదు. ఈ విధంగా, ప్రపంచ ప్రజలకు మరొకసారి ఆశాభంగం కలిగింది.

అంతేగాక, జనరల్ ఎసెంబ్లీ నిరాయుధీకరణ సమస్యపై చర్చలను ముగిస్తున్న రోజుననే, అమెరికా విదేశాంగ శాఖ మంత్రి డల్లెస్ యూరపు ఖండానికి కొన్ని రకాల రాకెట్ ఆయుధాలను పంపడానికి వారికి ఒక పథకం ఉన్నట్లు వెల్లడించారు. ఇలాంటి చర్యలు అంతర్జాతీయ ఉద్రిక్తతను సడలింపజేయడానికి యేమాత్రము యినా తోడ్పడతాయేమో మీరే ఆలోచించండి.

తర్వాత జరిగిన మరికొన్ని పరిణామాలు, యుద్ధ భీతి అధికం చేయబడుతున్నదనీ, అధికాయుధోత్పత్తి విచ్చలవిడిగా కొనసాగుతున్నదనీ తీవ్రమైన భయాన్ని మాలో న్యాయంగానే కల్పించాయి.

ఈ మధ్య ప్రముఖ పాశ్చాత్య రాజకీయవేత్తలు చేస్తున్న ప్రకటనలనుబట్టి, అందులోను ముఖ్యంగా ఐసన్‌హోవర్-మాక్మిలన్‌ల సమావేశ ఫలితాలపై గావింపబడిన ప్రకటననుబట్టి అమెరికన్, బ్రిటిష్ ప్రభుత్వాలు నిరాయుధీకరణ సమస్యను పరిష్కరించడానికీ, అణు, ఉదజని ఆయుధాల నిషేధానికి అంగీకరించడానికీ సంసిద్ధంగా లేవన్న నిర్ణయానికి యెవ్వరూ రాకమానరు. పైగా, దానికి భిన్నంగా వారు, అత్యవసర సమస్యల పరిష్కారాన్ని మరింత క్లిష్టంచేసి, నిరాయుధీకరణ సమస్యను కచ్చితంగా వెనుకకు నెట్టివేసే చర్యలను గైకొంటున్నారు.

ఉత్తర అట్లాంటిక్ కూటమి (నాటో) కౌన్సిల్ సమావేశమొకటి డిసెంబరు 16వ తేదీన ప్యారిస్‌లో ప్రారంభం కాబోతున్న విషయం మీకు తెలిసిందే. మామూలుకంటే యీ సమావేశంయొక్క ప్రత్యేకత యేమిటంటే, 'నాటో' దేశాల అధిపతులు దీనిలో పాల్గొనబోతున్నారు. అధికాయుధోత్పత్తి పోటీని మరింత తీవ్రతరం చేయడమూ, 'నాటో' దేశాలకు అణు, రాకెట్ ఆయుధాలను యివ్వడానికి నూతన వ్యూహ పథకాలను రూపొందించడం విషయాలను గురించి చర్చించడమే యీ సమావేశం యొక్క ఉద్దేశ్యమన్న విషయాన్ని నాటో నాయకులు యేమాత్రం దాచడంలేదు.

'నాటో' దేశాల "పరస్పర ఆధార పథకం" అనబడేది వాషింగ్‌టన్‌లో ఐసెన్‌హోవర్, మాక్మిలన్‌ల సమావేశంలో సిద్ధం చేయబడింది. ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక, తదితర దురాక్రమణ కూటముల సభ్యదేశాలపైన వాటి మూలాధారాలను విస్తృతంగా వినియోగించుకొనేందుకూ, యుద్ధ సన్నాహాల దృష్ట్యా విదేశాంగ విధానం విషయంలో వాటి స్వేచ్ఛను అరికట్టడానికీ మరింత వత్తిడి తేబడుతున్నదని దీనివల్ల వ్యక్తమవుతున్నది.

ఈ పథకాలన్నీ, యుద్ధోన్మాదపు కృత్రిమ వాతావరణంలోను, సోవియట్ దేశంనుండి "దురాక్రమణ ప్రమాదం" యేర్పడుతున్నదని ప్రజలను భయపెడుతున్న వాతావరణంలోను రూపొందించబడుతున్నాయని మీరు గ్రహించే వుంటారు. భూమండలపు కృత్రిమ ఉపగ్రహాన్ని అంతరిక్షంలోకి యెగురవేయడం

లాంటి మహత్తర వైజ్ఞానిక, సాంకేతిక విజయం గూడా యుద్ధ ఉద్రిక్తతను రెచ్చగొట్టడానికి వినియోగింపబడుతున్నది.

అయినప్పటికి, విస్తృతమైన ప్రాంతాల్లో మృత్యువును వినాశనాన్ని విస్తరింపజేయగల ఖండాంతరగామి క్షిపణులు, ఉదజని, అణు బాంబులు యెన్నడూ ఉపయోగింపబడకూడదనీ, మానవ మేధస్సు యొక్క యీ మహత్తర విజయాలు కేవలం మానవ సమాజపు శాంతియుత పురోభివృద్ధికే ఉపయోగింపబడుతూ వుండాలనీ సోవియట్ దేశం పట్టుపడుతువచ్చింది. ఇప్పుడుగూడా పట్టుబడుతున్నదన్న విషయం ప్రపంచానికంతటికీ తెలిసిందే.

అమెరికా పైనగాని, మరే యితర దేశాలపైనాగాని దాడి జరిపే ఉద్దేశం సోవియట్ దేశానికి లేదని అమెరికన్ ప్రభుత్వానికీ, ఇతర పాశ్చాత్య దేశాల ప్రభుత్వాలకూ బాగా తెలుసు. పైగా అందుకు భిన్నంగా సోవియట్ దేశం సహజంగానే అమెరికాతో సహా, అన్ని దేశాలతోను సత్సంబంధాలను కలిగి ఉండాలని కోరుకుంటున్నది.

కొన్ని వర్గాలు, తమ దురాక్రమణ పూరిత విదేశాంగ విధానానికి వెల్లవేయడం కొరకూ, పెచ్చుపెరిగిపోతున్న తమ సైనిక వ్యయాన్ని సమర్థించుకోడానికీ సోవియట్ దేశ విదేశాంగ విధానం యొక్క శాంతియుత ఉద్దేశ్యాలను వక్రంగా చిత్రిస్తున్నాయి.

నిరాయుధీకరణ కమీషన్‌లోను, దాని ఉపసంఘంలోను, ఉత్తర అట్లాంటిక్ కూటమి సభ్యదేశాల చర్యలు సరిగ్గా యీ ఉద్దేశ్యంతోనే కొనసాగింపబడుతూ వచ్చాయని యీ మధ్య గడచిన సంవత్సరాల అనుభవం వెల్లడిచేస్తుంది. నిరాయుధీకరణ కమీషన్‌లో అధిక సంఖ్యాక బలాన్ని కలిగి ఉండడంవల్ల పాశ్చాత్య రాజ్యాలు నిజానికి నిరాయుధీకరణ ప్రయత్నాలను విచ్ఛిన్నం గావించాయి. ఈ సంఘాన్ని, మూకఉమ్మడిగా ప్రజా వినాశనాన్ని గావించే అస్త్రాయుధాలతో సహా ఆయుధోత్పత్తి పోటీని తీవ్రతరంచేయడానికి ఒక మరుగుగా ఉపయోగించుకొన్నాయి.

మిత్రరాజ్య సమితి నిరాయుధీకరణ కమీషన్ పనిచేయు విధానంలో కొంత విస్తృతిని కోరుతూ నవంబరు 19వ తేదీన జనరల్ ఎసెంబ్లీలో చేయబడిన తీర్మానం నిజానికి ప్రస్తుత వ్యవహారాలను యేమాత్రమూ మార్చలేదు. కమీషన్ సభ్యులలో అధిక సంఖ్యాకులు 'నాటో'లోని సభ్యులే. ఈ అధిక సంఖ్యాక బలంపైన ఆధారపడి, రహస్య సమావేశాలలోని చర్చల చాటున అధికాయుధోత్పత్తి పోటీని కప్పిపుచ్చుకొన ప్రయత్నిస్తారు.

ఇలాంటి కమీషన్‌లో సోవియట్ దేశం పాల్గొనలేకపోవడమూ, అందరికీ తెలిసే వాతావరణంలో, ప్రజల అజమాయిషీ క్రింద పనిచేయగల మిత్రరాజ్య సమితి సభ్యదేశాలన్నింటి ప్రతినిధులతో కూడిన ఒక శాశ్వతమగు మిత్రరాజ్య సమితి నిరాయుధీకరణ కమీషన్ యేర్పాటు గావింపబడడం అతి సవ్యమైన మార్గమని తలంచడమూ సహజమైన విషయాలే. సోషలిస్టు దేశాలకూ, తటస్థ దేశాలకూ కనీసం సగం స్థానాలైనా ఉంటూ దేశాలకు న్యాయమైన ప్రాతినిధ్యం ఉండే కమీషన్, తక్కువ ప్రాతినిధ్యపుదైనప్పటికీ అంగీకరిస్తామని మేము తెలియజేసిన సంగతి మీకు తెలిసినదే.

'నాటో' కౌన్సిల్ సమావేశం జరుగబోతున్న యీ సమయంలో, ఉత్తర అట్లాంటిక్ కూటమిని, 'సియాటో', బాగ్దాద్ ఒడంబడికల లాంటి సైనిక కూటములతో యేదో ఒకవిధంగా ఏకం చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నట్లు తెలియవస్తున్నది. ఈ కూటములు ఆగ్నేయ ఆసియాలోను, మధ్య ప్రాచ్యంలోను పరిస్థితులను తీవ్రతరం చేస్తున్నాయని మీరు అనేక పర్యాయాలు సరిగ్గానే వెల్లడించారు. ఈ పథకాలు అమలుపర్చబడినట్లయితే, అంతర్జాతీయ పరిస్థితిని తీవ్రతరం చేయడానికీ, నూతన యుద్ధప్రమాదాన్ని మరింత సమీపానికి తీసుకొనిరావడానికీ, ఆసియాలోని శాంతిమండలానికి, స్వతంత్రమైన అభివృద్ధి మార్గాన్ని నడుస్తున్న ఆ ఖండంలోని దేశాల భద్రతకు ప్రమాదాన్ని కల్పించడానికీ కారణభూతమవుతాయి. వీటి అమలు మిత్రరాజ్యసమితి కార్యకలాపాలపైన అత్యంత ప్రమాదకరమైన ఫలితాలను కలుగజేస్తుంది.

అమెరికా, బ్రిటన్‌ల పాలకవర్గాలు మధ్యప్రాచ్యప్రజల పట్ల వలసపెత్తందారీ విధానాన్ని అవలంభించడంలోనేగాక, ఆసియా, ఆఫ్రికాలలోని ఇతర దేశాలపైన గూడా తమ ఆధిపత్యాన్ని చేకూర్చుకొనేందుకు గూడా ఒకరినొకరు బలపర్చుకోడానికి ఒప్పందానికి వచ్చారని ఈమధ్య జరిగిన ఐసన్‌హోవర్–మాక్మిలన్‌ల సంప్రదింపుల ఫలితాలనుబట్టి వెల్లడవుతున్నది. "శూన్యస్థితి" అనబడే సిద్ధాంతంపై ఆధారపడివున్న ఐసన్‌హోవర్ పథకం నిజానికిప్పుడు ఐసన్‌హోవర్-మాక్మిలన్‌ల పథకమయింది. "శూన్యస్థితి" అనబడే సిద్ధాంతం, బయటి జోక్యంగాని, వత్తిడిగాని లేకుండా తమభవిష్యత్తును నిర్మించుకొనే హక్కును కలిగియున్న ఆసియా, ఆఫ్రికా దేశాలకు అత్యంత ప్రమాదకరమయినదని మీరు అభిప్రాయపడినట్లుగానే సోవియట్ ప్రభుత్వంకూడా అభిప్రాయపడుతున్నది.

పాశ్చాత్య రాజ్యాలు ఇతరులపై తమ బలప్రయోగంతో

గాని, లేదా బలప్రయోగం చేస్తామని భయపెట్టిగాని ఒప్పాలని అభిలషిస్తారు. కాని ప్రపంచ వ్యవహారాలలో ఇందుకు భిన్నమైన మరొక విధానం ఉన్నది. సోవియట్ దేశం, చైనా ప్రజా రిపబ్లిక్‌లతోపాటు అనేక ఇతర దేశాలు దీనిని అనుసరిస్తున్నాయి. అంతర్జాతీయ ఉద్రిక్తత సడలింపు, అన్నిదేశాల శాంతియుత సహజీవనపు విధాన మది

శాంతిని సుస్థిరం చేయాలన్న అభిలాషతో సోవియట్ ప్రభుత్వం, అన్నిదేశాలు తమ సంబంధాలను ఒకరి ప్రాదేశిక సమైక్యత, సర్వసత్తాధికారాలపై మరొకరికి గౌరవము, నిరాక్రమణ, ఒకరి ఆంతరంగిక వ్యవహారాలలో మరొకరు జోక్యం కలుగజేసుకొనకపోవడము, అన్న ప్రాతిపదికపైన, సమానత్వం, పరస్పర లాభం ప్రాతిపదికపైన, ఒక్కమాటలో చెప్పాలంటే శాంతియుత సహజీవన సూత్రాల ప్రాతిపదికపైన స్థాపించుకోవాలని ఎసెంబ్లీ అన్ని దేశాలకు విజ్ఞప్తి చేయాలంటూ మిత్రరాజ్యసమితి జనరల్ ఎసెంబ్లీ ప్రస్తుత పన్నెండవ సమావేశంలో ఒక ప్రతిపాదనను గావించింది.

ఈ పంచసూత్రాలు, భారతదేశం, చైనాల ప్రకటనలోను, ఆ తర్వాత బాండుంగ్ మహాసభలోను ప్రకటింపబడిన విషయం అందరికి తెలిసినదే.

ఈ ప్రతిపాదనలో మానవజాతిని మరొక యుద్ధభీభత్సం నుండి కాపాడే శాంతియుత సహజీవన విధానం యిమిడియున్నది గాబట్టి శాంతిప్రియదేశాల, ప్రజల తోడ్పాటు చేకూరుతుందని మేము గట్టిగా నమ్ముతున్నాము.

కొన్ని వర్గాలు వాస్తవ దృక్పథాన్ని గోల్పోయి, వినాశకర అణుయుద్ధ ప్రమాదాన్ని మరింత దగ్గరకు తీసుకవచ్చే చర్యలను గైకొంటున్న యీ సమయంలో, అమెరికా, సోవియట్ యూనియన్ల ప్రభుత్వాలకు మీరు చేసిన విజ్ఞప్తి అతి ముఖ్యమైనదీ, గొప్ప చొరవతో కూడుకొన్నదీనని మేము అభిప్రాయపడుతున్నాము. కోటానుకోట్ల ప్రజల ప్రయోజనాలు, భవిష్యత్తులపట్ల నిర్లక్ష్యభావం కలవారుమాత్రమే దానిని విస్మరింపగలరు.

సోవియట్ ప్రభుత్వానికి సంబంధించినంతవరకు అది, అన్ని అణ్వాయుధ ప్రేలుళ్ళను ఆపివేయమంటూ మీరుచేసిన విజ్ఞప్తిని అత్యంత శ్రద్ధతో పరిశీలించింది. అణ్వాయుధాలను కలిగివున్న అమెరికా బ్రిటన్‌లుగూడా పాటవ పరీక్షలను జరపడానికి సంసిద్ధమవుతున్న తమ ప్రయత్నాలను 1958 జనవరి మొదటి తేదినుండి ఆపివేస్తామని ప్రకటించినట్లయితే సోవియట్ దేశం కూడా 1958 జనవరి మొదటి తేదీనుండి ఏలాంటి అణ్వాయుధాలనూ ప్రేల్చబోదు.

అమెరికా, బ్రిటన్‌ల ప్రభుత్వాలు సుహృద్భావాన్ని ప్రదర్శించినట్లయితే, ఇలాంటి చర్య, అంతర్జాతీయ పరిస్థితి బాగుపడడానికి, అంతర్జాతీయ సంబంధాల విషయంలో అవసరమైన విశ్వాసాన్ని కల్పించడానికీ, క్రమంగా మొత్తం నిరాయుధీకరణ సమస్య పరిష్కారానికీ దోహదమివ్వగలదని సోవియట్ ప్రభుత్వం నమ్ముతున్నది.

ఇకపైని విషయం, అమెరికా, బ్రిటన్‌ల ప్రభుత్వాలపైన ఆధారపడివున్నది.

ప్రధానమంత్రీ, భయాన్ని తొలగించడమూ, అధికాయుధోత్పత్తి పోటీయొక్క ప్రమాదకర ధోరణిని మార్చడము అవసరమన్న విషయంలో మేము మీతో పూర్తిగా యేకీభవిస్తున్నాము. అణ్వాయుధ మనస్తత్వాన్ని అంతమొందించవలసిన సమయమాసన్నమయినది. ఈ మనస్తత్వం యెంతవరకూ పోయిందంటే, అణు, ఉదజని బాంబులతో కూడిన అమెరికన్ విమానాలు ఇతర దేశాల భూభాగాలపై గస్తీ తిరుగుతున్నాయి. ఈ విధంగా వారు ఆ దేశాల జనాభాకు, మొత్తంగా శాంతి ప్రయోజనానికి యెంత ప్రమాదాన్ని కల్పిస్తున్నారో గుర్తించడం లేదు. ఇలాంటి బాధ్యతారహితమైన చర్యలఫలితంగా, అణు, ఉదజని ఆయుధాలు వినియోగింపబడే యుద్ధం ఆత్మనిగ్రహాన్ని గోల్పోయిన యే పైలెట్ చేతనో, లేక కవ్వింపుచర్యకు దిగదలచే యే పైలెట్ చేతనో ప్రారంభింపబడవచ్చును.

శ్రీ నెహ్రూ, తాము తమ విజ్ఞప్తిలో సరిగ్గా తెలియజేసినట్లు ఒక్క నైతిక దృష్ట్యానే గాక, ప్రత్యక్ష పరిస్థితులదృష్ట్యా గూడా మానవజాతి యేకైకమార్గమయిన శాంతియుత సహజీవన మార్గాన్ని అవలంబించవలసిన ఆవశ్యకత యేర్పడుతున్నది. మానవజాతి శాంతితో జీవించాలంటే, వివాదాస్పదమైన సమస్యలను బలప్రయోగంతోగాని, బలప్రయోగం చేస్తామని బెదరింపుతోగాని పరిష్కరించే ఉన్మాద పద్ధతిని విడనాడవలసి వుంటుంది.

విశ్వశాంతి పరిరక్షణను చేకూర్చాలంటే, పెట్టుబడిదారి దేశాలు, సోషలిస్టు దేశాలు అస్తిత్వంలో ఉంటున్న ప్రపంచములో రూపొందిన పరస్థితిని కచ్చితంగా గుర్తించవలసిన అవసరం ఉన్నదని మేము అభిప్రాయపడుతున్నాము. బయటి బలప్రయోగంతో ఇలాంటి పరిస్థితిని మార్చడానికిగాని, ప్రస్తుత "యధాస్థితి"ని భంగపర్చడానికిగాని, యెలాంటి ప్రయత్నం జరిగినా, ప్రాదేశిక సమైక్యతలో మార్పులు జరిపించడానికి యెలాంటి ప్రయత్నం జరిగినా అవి వినాశకర ఫలితాలు కలుగజేయగలవని మనమందరమూ గుర్తించక తప్పదు.

వివిధ దేశాలమధ్య సంబంధాల విషయంలో ద్వేషం, దౌర్జన్యాల విధానం అవలంబింపబడరాదన్న మీ అభిప్రాయం మాకు బాగా అర్థమయింది. సోవియట్ దేశం, సోవియట్ రాజ్యం స్థాపితమైన మొట్టమొదటిరోజుల్లో చేసిన ప్రకటనలోని శాంతి భావాల కనుగుణ్యంగా, అన్ని దేశాలతో శాంతి, స్నేహాలతో ఉండాలని కోరుకొంటున్నది. విశ్వాసపూరిత వాతావరణాన్ని కల్పించడానికి, అంతర్జాతీయ వాతావరణాన్ని విషపూరితం గావిస్తున్న "ప్రచ్ఛన్నయుద్ధా"న్ని అంతమొందించడం యెన్నడూ లేనంతగా ఇప్పుడు అవసరమవుతున్నది.

ఈ విషయాలను దృష్టియందుంచుకొని సోవియట్ దేశం ఇంతకు పూర్వంవలెనే. అమెరికాతో స్నేహ ఒడంబడికను చేసుకోవాలనీ, అన్ని దేశాలతో సత్సంబంధాలను స్థాపించుకోవాలనీ, సైనిక కూటములు రద్దు గావింపబడడమో లేక వివాదాస్పదమైన సమస్యలను శాంతియుత పద్ధతుల ద్వారా మాత్రమే పరిష్కరించుకోవాలని కోరుతూ 'నాటో' సభ్యుల మధ్య, వార్సా ఒడంబడిక సభ్యులమధ్య ఒక ఒడంబడిక జరగాలనీ కోరుతున్నది. కొన్ని దేశాలలో రేడియోలోనూ, పత్రికల్లోను గావింపబడుతున్న వైరభావపు యుద్ధ ప్రోత్సాహక ప్రచారం అంతమొందింపబడాలని కోరుతున్నది.

వివిధ దేశాల ప్రజలమధ్య విశ్వాసాన్ని నెలకొల్పడానికి వాణిజ్యవిస్తరణగూడా నిర్ణయాత్మకమేగాక, మహత్తర ప్రాముఖ్యతను కలిగిఉన్నది. ఇది వివిధ దేశాల ప్రజలకు ఆర్థిక లాభాలను చేకూర్చడమేగాక, అంతర్జాతీయ ఉద్రిక్తతను తగ్గించడానికిగూడా తోడ్పడుతుంది.

మన నెదుర్కొంటున్న ప్రమాదాన్ని అరికట్టడానికి ఇప్పటికి గూడా యేమీ మించిపోలేదని సోవియట్ ప్రభుత్వం గట్టిగా విశ్వసిస్తున్నది. అందరికీ అంగీకారయోగ్యమైన ఒడంబడిక కుదుర్చుకోవాలన్న ఆకాంక్ష ఉండి త్రికరణశుద్ధితో, సమాన హోదాతో కూడిన సంప్రదింపుల మార్గాన్ని, సంబంధం ఉన్న అన్ని దేశాలకు అంగీకారయోగ్యమైన నిర్ణయాలమార్గాన్ని అవలంభించినట్లయితే అధికాయుధోత్పత్తి పోటీని ఆపడము, అంతర్జాతీయ పరిస్థితిని బాగుపర్చడము సాధ్యమవుతుంది.

అమెరికా, సోవియట్ దేశ ప్రభుత్వాలకు మీరుచేసిన మానవతాదృక్పథం గల విజ్ఞప్తిని మేము, అంతర్జాతీయ వ్యవహారాలలో భారత దేశం అందులోను, శాంతి అభ్యుదయాలకొరకు నిర్విరామంగా పోరాడే మనిషిగా వ్యక్తిగతంగా మీరు వహిస్తున్న పాత్రయొక్క నూతన నిదర్శనంగా, గుర్తిస్తున్నాము. విజ్ఞప్తిలో మీరు, మీదేశంలోను, ఇతర దేశాల్లోను ఉన్న అనేకమంది ప్రజల భావాలను, ఆకాంక్షలను యెంతో శక్తివంతంగా వెల్లడించారు.

యుద్ధం ప్రారంభమయ్యే ప్రమాదాన్ని తొలగించడానికి సోవియట్ ప్రభుత్వం తనకు సాధ్యమైనదంతా చేస్తుంది. న్యాయము, ప్రపంచమంతటా వున్న సామాన్య ప్రజల ప్రయోజనాలు గుర్తింపబడుతాయనీ, చిట్టచివరికి, ప్రపంచానికి అణుయుద్ధ ప్రమాదాన్ని శాశ్వతంగా తొలగించగల పరిష్కారం సాధింపబడుతుందనీ మేము నమ్ముతున్నాము.

మీరు, ఇంతవరకు చేస్తున్నట్లే, అంతర్జాతీయ ఉద్రిక్తత సడలింపుకూ, దేశాలమధ్య సుస్థిరశాంతి స్థాపనకూ దోహదం చేసేట్టుగా తమ పలుకుబడిని ఉపయోగించగలరని, సోవియట్ ప్రభుత్వం ఆశిస్తున్న విషయాన్ని నేను యీ లేఖను సంబోధిస్తూ తెలియజేస్తున్నాను.

మనఃపూర్వకంగా తమ,
(సంతకం) ఎన్. ఎ. బుల్గానిన్.

మాస్కో, డిసెంబరు 10, 1957



# శాంతిశక్తులు అసంఖ్యాకంగా వున్నాయి- యుద్ధాన్ని నిరోధించవచ్చును

## కమ్యూనిస్టు, కార్మిక పార్టీల ప్రణాళిక

ప్రవ్దాలో ప్రచురింపబడిన కమ్యూనిస్టు, కార్మిక పార్టీల ప్రతినిధుల సమావేశం గురించి ప్రకటన పాఠాన్ని యీ దిగువనిస్తున్నాము :

అక్టోబరు సామ్యవాద మహావిప్లవం 40 వార్షికోత్సవంలో పాల్గొన్న కమ్యూనిస్టు, కార్మిక పార్టీల ప్రతినిధివర్గాలు, మాస్కోలో తమ ఉనికిని స్నేహపూర్వకంగా సమావేశమై, అన్ని పార్టీలకు ఆసక్తిగల విషయాలను చర్చించడంకోసం వినియోగించవలెననుకున్నాయి.

నవంబరు 16, 19 తేదీలమధ్య మాస్కోలో ఒక సమావేశం జరిగింది; దీనికి ఆస్ట్రేలియా కమ్యూనిస్టుపార్టీ, ఆస్ట్రియా కమ్యూనిస్టుపార్టీ, ఆల్బేనియా లేబర్‌పార్టీ, అల్జీరియా కమ్యూనిస్టుపార్టీ, అర్జెంటైనా కమ్యూనిస్టుపార్టీ, బెల్జియం కమ్యూనిస్టు పార్టీ, బొలీవియా కమ్యూనిస్టు పార్టీ, బల్గేరియా కమ్యూనిస్టు పార్టీ, బ్రెజిల్ కమ్యూనిస్టు పార్టీ, గ్రేట్‌బ్రిటన్ కమ్యూనిస్టు పార్టీ, హంగేరీ సోషలిస్టు కార్మికపార్టీ, వెనెజులా కమ్యూనిస్టు పార్టీ, వియత్నాం శ్రామిక ప్రజలపార్టీ, గౌతెమెలా శ్రామిక పార్టీ, జర్మనీ కమ్యూనిస్టుపార్టీ, జర్మనీ సోషలిస్టు యూనిటీ పార్టీ, హోండురస్ కమ్యూనిస్టుపార్టీ, గ్రీస్ కమ్యూనిస్టుపార్టీ, డెన్మార్క్ కమ్యూనిస్టు పార్టీ, డొమినికన్ రిపబ్లిక్ సోషలిస్టు పార్టీ, ఇస్రాయిల్ కమ్యూనిస్టుపార్టీ, భారతదేశ కమ్యూనిస్టుపార్టీ, ఇండొనీషియా కమ్యూనిస్టుపార్టీ, జోర్డాన్ కమ్యూనిస్టుపార్టీ, ఇరాక్ కమ్యూనిస్టుపార్టీ, స్పెయిన్ కమ్యూనిస్టుపార్టీ, ఇటాలియన్ కమ్యూనిస్టుపార్టీ, కెనడా లేబర్ ప్రోగ్రెసివ్‌పార్టీ, చైనా కమ్యూనిస్టు పార్టీ, కొలంబియా కమ్యూనిస్టుపార్టీ, కొరియా లేబర్‌పార్టీ, కోస్టారికా పీపుల్స్ వేంగార్డ్‌పార్టీ, క్యూబా పీపుల్స్ సోషలిస్టు పార్టీ, లక్సెంబర్గ్ కమ్యూనిస్టుపార్టీ, మలయా కమ్యూనిస్టుపార్టీ, మొరక్కో కమ్యూనిస్టు పార్టీ, మెక్సికో కమ్యూనిస్టు పార్టీ, మంగోలియా పీపుల్సు రివల్యూషనరీపార్టీ నెదర్లాండ్స్ కమ్యూనిస్టుపార్టీ, న్యూజిలాండ్ కమ్యూనిస్టుపార్టీ, నార్వే కమ్యూనిస్టు పార్టీ, పనామా పీపుల్సుపార్టీ, పెరుగ్వే కమ్యూనిస్టుపార్టీ, పెరూ కమ్యూనిస్టుపార్టీ, పోలెండ్ యునైటెడ్ వర్కర్స్‌పార్టీ, పోర్చుగల్ కమ్యూనిస్టుపార్టీ, రుమేనియా వర్కర్స్‌పార్టీ, సాన్‌మరీనో కమ్యూనిస్టుపార్టీ, సిరియా, లెబనాన్ కమ్యూనిస్టుపార్టీ, సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీ, థాయిలాండ్ కమ్యూనిస్టు పార్టీ, ట్యునీషియా కమ్యూనిస్టుపార్టీ, టర్కీ కమ్యూనిస్టుపార్టీ, ఉరుగ్వే కమ్యూనిస్టుపార్టీ, ఫిన్లాండ్ కమ్యూనిస్టుపార్టీ, ఫ్రాన్సు కమ్యూనిస్టుపార్టీ, సింహళ కమ్యూనిస్టుపార్టీ, చెకొస్లోవేకియా కమ్యూనిస్టు పార్టీ, ఛిలీ కమ్యూనిస్టు పార్టీ, స్విస్ పార్టీ ఆఫ్ లేబర్, స్వీడెన్ కమ్యూనిస్టుపార్టీ, ఈక్వెడోర్ కమ్యూనిస్టుపార్టీ, యుగొస్లావియా లీగ్ ఆఫ్ కమ్యూనిస్ట్సు, జపాన్ కమ్యూనిస్టు పార్టీ, ప్రతినిధులు హాజరయ్యారు.

ఈ సమావేశంలో పాల్గొన్నవారు వర్తమాన అంతర్జాతీయ పరిస్థితికి సంబంధించిన ప్రస్తుత సమస్యలపైని ఒకరి అభిప్రాయాలు ఒకరు తెలుసుకున్నారు.

కమ్యూనిస్టు, కార్మిక పార్టీల ప్రతినిధులు సకల దేశాల కార్మిక కర్షకులను, సర్వప్రపంచ స్త్రీ పురుషులనూ, సుహృజ్జనులందరినీ ఉద్దేశించి ఒక శాంతి ప్రణాళికను వ్రాయడానికి నిశ్చయించుకున్నారు; దాని పాఠం యీ దిగువ విధంగా వుంది :

మార్క్సిస్టు-లెనినిస్టుల భావాల, శ్రామికవర్గ అంతర్జాతీయతా సూత్రాల సమైక్యతాబద్ధమై వుండడంచేత, సోదర పార్టీలమధ్య సంబంధాలకు సహజమైన సన్నిహిత సహకారం, సుహృద్భావాల వాతావరణంలో సమావేశం జరిగింది.

కార్మిక కర్షకులారా ! వైజ్ఞానిక, సంస్కృతీవేత్తలారా! సర్వదేశ సుహృద్భావులారా !

అక్టోబరు సామ్యవాద మహావిప్లవం 40 వ వార్షికోత్సవానికి మాస్కోలో సమావేశమైన కమ్యూనిస్టు, కార్మిక పార్టీల ప్రతినిధులమైన మేము, మీ హేతుజ్ఞానానికీ, మీ హృదయాలకూ హెచ్చరిక చేస్తూ మీకు విజ్ఞప్తి చేస్తున్నాము.

ద్వితీయ ప్రపంచయుద్ధ విపత్తు యింకా జ్ఞాపకంలోనే వుంది. దాని ఘోర నష్టాలు యింకా పూర్తిగా పోలేదు; ఇంకో దుష్ట యుద్ధఛాయలు, ఒక సంఎరెట్లు అధిక వినాశాత్మకమైన యుద్ధ ఛాయలు యిప్పటికే శాంతియుతమైన నగరాలలోని, గ్రామాలలోని యిళ్ళపైని పడుతున్నాయి. జీవితానందాన్ని కలుషితం చేస్తూ యింకో యుద్ధప్రమాదం ప్రతిదేశాన్ని సమీపిస్తున్నది. ప్రతి యింట్లో యీ ప్రశ్న ఉదయిస్తోంది :

"రేపు, ఒక నెల తరవాత, ఒక ఏడాది తరవాత ఏమి జరుగుతుంది ; మళ్ళీ యుద్ధాగ్ని జ్వాలలు మనలను క్రమ్ముకుంటాయా ? సర్వవినాశాత్మకమైన పరమాణు, ఉదజని బాంబులు మననూ, మన పిల్లలనూ హతమార్చుతాయా ?

రెండు ప్రపంచయుద్ధాల శోకాకరమైన అనుభవం ప్రజలకు యిప్పటికే కలిగింది. యుద్ధంలో పెద్ద త్యాగాలు చేసేది, సర్వదా సామాన్య ప్రజలే. ఒకొక్క యుద్ధమూ అధికతరమైన బాధను కలుగజేస్తుందనీ, ఎక్కువ దేశాలను నాశనం చేస్తుందనీ ఎక్కువ మందిని చంపుతుందనీ, యింకా భయంకరమైన, శాశ్వత ఫలితాలను కలిగిస్తుందనీ వారెరుగుదురు.

పెద్ద సామ్రాజ్యవాద రాజ్యాల కారణంగా, జర్మన్ సైనిక తత్త్వంచే ప్రారంభింపబడిన మొదటి ప్రపంచ యుద్ధం కోటి ప్రాణాలను బలిపుచ్చుకుంది. కోట్లాదిమంది వికలాంగులయ్యారు, ఆరోగ్యాన్ని కోలుపోయారు. దేశాలకు దేశాలే ఆకలికీ, దారిద్ర్యానికీ గురయ్యాయి.

జర్మన్ ఫాసిజం ముఖ్య కారణంగా జరిగిన రెండవ ప్రపంచ యుద్ధం పెద్ద సేనలను నాశనం చేయడం మాత్రమే కాదు. బాంబులు నగరాలను నాశనం చేశాయి, లక్షలాదిమంది పౌరులను చంపాయి, నిర్బంధాలలో హిట్లరు కాన్‌సెంట్రేషన్ క్యాంపుల గ్యాస్‌ఛాంబర్లలోనూ కోట్లకొలదీ స్త్రీలూ, పురుషులూ, బాలలూ నశించిపోయారు. వేలకొలదీ అందమైన నగరాలను నిర్మించి, దేశాలకు దేశాలకే అన్నవస్త్రాలనివ్వడానికి చాలిన అపార భౌతిక సంపదలు మరణాన్ని, వినాశనాన్ని కలిగించడం కోసం ఉపయోగింపబడ్డాయి. మూడు కోట్లకు పైగా మానవ ప్రాణాలు,—క్షతగాత్రులనూ, వికలాంగులనూ లెక్కించకపోయినట్టయితే—రెండవ ప్రపంచ యుద్ధ మహా వినాశనంలో కబళించవేయబడ్డాయి. దాని చివరిరోజుల్లో తొలి రెండు పరమాణు బాంబులూ జపాను నగరాలపైని పడ్డాయి, భావి సంఘర్షణలలో సర్వమానవ హననానికి విస్పష్ట శకునంగా.

తరవాత వచ్చే యుద్ధం—అది సంభవించడానికి ప్రజలు సమ్మతించినట్టయితే—మానవజాతి యిప్పటివరకూ అనుభవించిన వినాశనం దేనినైనా మించిపోగలదని చెప్పడానికి, విజ్ఞాన శాస్త్రజ్ఞుని జ్ఞానంగాని, కవి ఊహాచాతుర్యంగాని అవసరంలేదు. యూరప్, అమెరికా, ఆసియా, ఆఫ్రికా, ఆస్ట్రేలియా ఖండాల ప్రజలకు మానవుడు యిటువంటి బ్రహ్మాండమైన ప్రకృతి శక్తులను విడుదల చేశాడనీ, అతనికి ఎటువంటి బలవత్తరమైన సాధనాలున్నాయంటే ప్రపంచంలోని ఏ భాగంపైనైనా వాటి వినాశనాన్ని వదలిపెట్టవచ్చుననీ ఎరుగుదురు. మరుచటి యుద్ధంలో గూడుగాని, భద్రత గాని ఉండదు. న్యూక్లియర్, రాకెట్ యుద్ధ జ్వాలలు సర్వ ప్రజలనూ క్రమ్ముకుంటాయి, తరతరాలకు చెప్ప శక్యంకాని బాధలను కలుగజేస్తాయి.

జాతి, రాజకీయాభిప్రాయాలూ, మత విశ్వాసం, లేదా వర్ణం ప్రశక్తి లేకుండా సర్వ ప్రపంచ ప్రజలూ శాంతితో జీవించ నభిలషిస్తున్నారు; ప్రపంచమంతటా సామాన్య ప్రజలు యిలా అంటున్నారు: ప్రకృతినుండి దాని రహస్యాలనన్నిటనీ పరిగ్రహిస్తూ, నానాటికీ అధికతరంగా దానిని లొంగదీసుకుంటూ, సోవియట్ భూఉపగ్రహాలను పంపడంలో యిప్పుడు శీఘ్రంగా గ్రహాలను చేరగల ఫలప్రదుడైన మానవుడు తప్పకుండా యుద్ధాన్ని, ఆత్మ వినాశనాన్ని నిరోధించగలడు!

కమ్యూనిస్టు, కార్మిక పార్టీల ప్రతినిధులమైన మేము మానవుని భవిష్యత్తు పట్ల మా బాధ్యతను పూర్తిగా గుర్తెరిగి యీ విధంగా ప్రకటిస్తున్నాము;

యుద్ధం అనివార్యమైనది కాదు. యుద్ధాన్ని నిరోధించవచ్చును, శాంతిని రక్షించి దానికి భద్రతను చేకూర్చవచ్చును.

నలభై ఏళ్ళ క్రితం మానవ చరిత్రలో నూతన శక ప్రారంభమొనర్చిన దేశపు ముఖ్య పట్టణంలో మేము సమావేశమయ్యాము. 1917 సంవత్సరంలో రష్యన్ నేలపైని తొలిసారిగా సామ్యవాద విప్లవం విజయవంతమైంది. కార్మిక ప్రజలు అధికారాన్ని వశపర్చుకుని, మనిషిని మనిషి చేసే పీడన, దోపిడీ రూపాలన్నిటికీ రూపుమాపడానికి పూనుకున్నారు. రష్యా కార్మిక కర్షకులు, లెనిన్ పార్టీ నాయకత్వాన, తమ పతాకాలపై శాంతిని లిఖించి, సర్వదా దానికి విధేయులై వున్నారు. నలభై ఏళ్ళలో సోవియట్ దేశం సకల ప్రజలకూ శాంతికి దారిని చూపింది, సామ్రాజ్యవాదులు ఆటంకాలు కల్పిస్తున్నప్పటికీ, సాంఘిక వ్యవస్థ ప్రసక్తి లేకుండా దేశాలన్నిటితోనూ సహజీవనాన్ని కోరింది.

పెట్టుబడిదారీ దేశాల కార్మికులు, తమ ప్రధాన ప్రయోజనాలను బలపర్చుకుంటూ, శాంతి సమరంలో యితోధికంగా పాల్గొన్నారు. ఈ మహదాశయాన్ని సర్వ ప్రపంచ అభ్యుదయకాముక ప్రజలు బలపర్చారు. అయినా శాంతిశక్తులు, నూతన విపత్తునుండి, ద్వితీయ ప్రపంచ యుద్ధంనుండి మానవజాతిని రక్షించలేకపోయాయి. అప్పుడీశక్తులకు చాలినంత బలం లేదు, అప్పుడు సోవియట్ దేశం శాంతికోసం అచంచలంగా పోరాడుతున్న ఒంటరిగావున్న దేశం.

ఇప్పుడు యుద్ధాన్ని నిరోధించడమూ, శాంతిని రక్షించ

డమూ సాధ్యమని కమ్యూనిస్టులమైన మేము చెప్తూవున్నాము. నేటి ప్రపంచ పరిస్థితి భిన్నంగా వున్నందువల్లనూ, శక్తుల బలాబలాలు మారినందువల్లనూ మేము పూర్తి విశ్వాసంతో యిది చెపుతున్నాము.

అక్టోబరు మహా విప్లవం ద్వారా జనించిన సోవియట్ల భూమి యిప్పుడు ఒంటరిగా లేదు, ఫాసిజంపైని విజయంద్వారా, సుమారు నూరు కోట్ల జనాభాతో విశాలమైన సామ్యవాద ప్రపంచం అవతరించింది. శాంతికోసం, అంతర్జాతీయ సహకారం కోసం, విభిన్న సాంఘిక వ్యవస్థల శాంతియుత సహజీవనంకోసం సోవియట్ దేశంతో భుజం భుజం కలిపి పురోగమిస్తూ యింకో పెద్ద సామ్యవాద రాజ్యం వుంది — అదే ప్రజా చైనా.

ఆ శాంతియుత లక్ష్యాలకోసమే కృషిచేస్తూ, ప్రజాతంత్ర ప్రజాసామ్యానికి చెందిన యూరప్, ఆసియా దేశాలున్నాయి.

సోవియట్ దేశంలోనూ, యితర సామ్యవాద దేశాలలోనూ జరిగిన అపూర్వమైన పారిశ్రామిక, వైజ్ఞానిక, సాంకేతికాభివృద్ధి శాంతికి దోహదం చేస్తుంది, యుద్ధానికి పెద్ద నిరోధంగా పనిచేస్తుంది.

ప్రపంచ రంగంలో యింకో నూతన శక్తి వెలిసింది — అది అక్టోబరు విప్లవం మేల్కొల్పిన వలసప్రజ. యుగయుగాల పరాధీనతా భారాన్ని వారిలో కొందరు యిప్పటికే త్రోసి పుచ్చారు, యితరులు త్రోసివేస్తున్నారు. వారు శాంతియుతంగా జీవించ నభిలషిస్తున్నారు, తమ ఆంతరంగిక వ్యవహారాలలో ఏ సామ్రాజ్యవాదుల జోక్యానికీ వారు సమ్మతించరు. తమ వెనుకబాటుతనాన్నీ, దారిద్ర్యాన్నీ తొలగించుకునేందుకు, వారు శాంతి, తాటస్థ్యవిధానాన్ని అవలంబిస్తున్నారు, ప్రఖ్యాత పంచశీలాల విధానమైన భూభాగం అఖండత్వల సర్వ స్వతంత్రతలపట్ల గౌరవం, నిరాక్రమణ, ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం కలుగజేసుకోక పోవడం, సమానత్వం, పరస్పర లాభం, శాంతియుత సహజీవనం అన్న విధానాన్ని, యుద్ధాన్ని వాంఛించనిది సామ్యవాద దేశాలు మాత్రమే కాదు, ప్రాచ్య దేశాలు మాత్రమే కాదు. రెండుసార్లు యుద్ధాన్ని అనుభవించిన పాశ్చాత్య పెట్టుబడిదారీ దేశాల ప్రజలు కూడా దానిని ద్వేషిస్తున్నారు.

శాంతి శక్తులు బహుళంగా ఉన్నాయి.

అవి యుద్ధాన్ని నిరోధించగలవు, శాంతిని పరిరక్షించగలవు. అయినా, కమ్యూనిస్టులమైన మేము, రాక్షస, సర్వవినాశక యుద్ధ ప్రమాదం తొలగిపోలేదని సర్వప్రపంచ ప్రజలకు హెచ్చరించవలసినబాధ్యత మాకున్నదని విశ్వసిస్తున్నాము.

ప్రజల శాంతి భద్రతలకు ప్రమాదం దేనినుండివస్తుంది? యుద్ధంవల్ల లాభం పొందుతూ, రెండు ప్రపంచ యుద్ధాలనుంచి, ప్రస్తుత అమితాయుధోత్పత్తినుండీ, అపూర్వ సంపదలను గడించిన పెట్టుబడిదారీ గుత్తవ్యాపార సంస్థలనుండి. గుత్తవ్యాపారస్తులకు గొప్పలాభాలను సంపాదించే అమితాయుధోత్పత్తి, కార్మిక ప్రజలపైని పెద్ద భారంగా వుంది, దేశాల ఆర్థిక విధానాన్ని తీవ్రంగా నష్టపరుస్తోంది. గుత్తవ్యాపార సంస్థల ఒత్తిడి వల్ల, ముఖ్యంగా అమెరికా గుత్తవ్యాపార సంస్థల ఒత్తిడి వల్ల కొన్ని పెట్టుబడిదారీ దేశాల పాలక వర్గాలు నిరాయుధీకరణకూ, న్యూక్లియర్ ఆయుధాల నిషేధానికీ, యుద్ధనిరోధానికి ఉద్దేశింపబడిన యితర చర్యలకూ చేయబడిన ప్రతిపాదనలను తిరస్కరించాయి. శాంతికాముక దేశాలు మిత్రరాజ్యసమితికి అద్భుతమైన చాలా ప్రతిపాదనలను నివేదించాయి; అవి అంగీకరింపబడినట్టయితే, శాంతి బలపడివుండేది. యుద్ధ ప్రమాదం తగ్గివుండేది. అమితాయుధోత్పత్తి పోటీని తుదముట్టించడానికీ, పరమాణుయుద్ధ ప్రమాదాన్ని తొలగించడానికీ, అంతర్జాతీయ సంబంధాలలో సరియైన విశ్వాసాన్ని సృష్టించేందుకు, ఒక అత్యంత ముఖ్యాంశమైన దేశాల శాంతియుత సహజీవనాన్ని, దేశాలమధ్య ఆర్థిక సహకారాన్ని పెంపొందించడానికీ, ఉద్దేశింపబడిన ప్రతిపాదనలను మిత్రరాజ్యసమితికినివేదించడం, సకల దేశాల ముఖ్య ప్రయోజనాలకు అనుగుణమైనది కాదని ఎవ్వరూ అనలేరు. ప్రపంచ భవితవ్యం, భావితరాల భవితవ్యం యీ సమస్యల పరిష్కారంపైని ఆధారపడివున్నాయి. అంతర్జాతీయ ఉద్రిక్త పరిస్థితిని కొనసాగించడంలో ఆసక్తిగలవారు మాత్రమే. యీ ప్రతిపాదనలను తీవ్రంగా ప్రతిఘటించారు.

వేలాది వార్తాపత్రికలూ, రేడియో స్టేషన్లూ అమెరికా. బ్రిటన్, ఫ్రాన్సు, ఇటలీ మొదలైన దేశాల ప్రజల మనస్సులలోనికి, "ప్రపంచ కమ్యూనిజం" వారి స్వాతంత్ర్యానికీ, జీవిత విధానానికీ, వారి శాంతియుతమైన మనగడకూ ప్రమాదం వాటిల్ల చేస్తున్నదని అనుదినమూ ఎక్కిస్తున్నాయి.

కమ్యూనిస్టు పార్టీలకుగాని, సోషలిస్టు దేశాల్లో దేనికిగాని యితర దేశాలపైని యుద్ధాలనో, సైనిక దాడులనో జరపడానికిగాని. పరాయి భూములను ఆక్రమించుకోడానికిగాని ఉద్దేశంగాని కారణంగాని లేదు. సోవియట్ దేశానికి. ప్రజా చైనాకూ విశాలమైన భూములూ, అపారమైన ప్రకృతి, సంపదలూ ఉన్నాయి. అన్ని సామ్యవాద దేశాలలోనూ యుద్ధంలో ఆసక్తిగల వర్గాలుగాని. సాంఘిక బృందాలుగాని లేవు. అన్ని యుద్ధాలలోనూ అత్యధికంగా బాధలుపడిన కార్మిక కర్షకుల చేతుల్లో అధికారం వుంది. వారింకో యుద్ధాన్ని కోరడం సాధ్యమేనా? కమ్యూనిస్టుల లక్ష్యం, విశ్వశ్రేయోదాయిని అయిన, సకల దేశ ప్రగతిశీలమైన, వాటిమధ్య శాశ్వత శాంతిప్రదాయిని అయిన సంఘ నిర్మాణం, ఇటువంటి సంఘాన్ని నిర్మించేందుకు, సామ్యవాద దేశాలకు సుస్థిర శాశ్వత శాంతి అవసరం. అందువల్ల, కమ్యూ

నిస్టులకంటె పట్టుదలగల యుద్ధ శత్రువులూ లేరు, శాంతిని దృఢంగా బలపర్చేవారు లేరు।

సామ్యవాద దేశాలు యింకే దేశంపైనీ తమ సాంఘిక, లేదా రాజకీయ వ్యవస్థను రుద్దదల్చుకోలేదు. సామ్యవాదం తప్పక జయిస్తుందని వారి దృఢ విశ్వాసం, కాని బయటినుండి తీసుకవచ్చి సామ్యవాదాన్ని స్థాపించలేమనీ, దేశంలోని కార్మిక వర్గమూ, తదితర అభ్యుదయ శక్తులన్నీ చేసిన పోరాటంద్వారా అది వస్తుందనీ వారెరుగుదురు. తమ ఆంతరంగిక వ్యవహారాలలో యితరులు జోక్యం కలుగజేసుకోవడానికి తాము ఎలా సమ్మతించారో, అదేవిధంగా యితర దేశాల అంతరంగిక వ్యవహారాలలో తాము జోక్యం కలుగజేసుకోవడానికి సామ్యవాద దేశాలకు అభిలాష లేకపోవడం యిందువల్లనే. అందుచేత, సామ్యవాద దేశాలు శాంతికి ప్రమాదకారులనీ, యితరులపైని తమ వ్యవస్థనవి రుద్దదల్చుకున్నవనీ చేయబడే వాదన, శాంతికి వాంఛించేవారిని పెడదారిని పట్టించడానికి చేసే ప్రయత్నం మాత్రమే. శాంతిప్రియులందరూ తమ శక్తులను సమీకరించుకున్నయితే, యుద్ధ ప్రేరేపకుల కుతంత్రాల విషయంలో అధికంగా జాగురూకతతో వున్నట్లయితే, ప్రమాదం కలిగింపబడుతోన్న శాంతి పోరాటాన్ని తీవ్రతరం గావించడం తమ పవిత్ర ధర్మమని పూర్తిగా గ్రహించినట్లయితే, శాంతి రక్షింపబడుతుంది.

సర్వ ప్రపంచ ప్రజల సంక్షేమాన్ని మనసున ఉంచుకుని, సకల దేశాల ప్రజలకు అభ్యుదయాన్ని తేజోవంతమైన భవిష్యత్తునూ వాంఛిస్తూ యీ దిగువవారికి కార్మిక, కర్షకులకు, స్త్రీపురుషులకూ, వైజ్ఞానిక, కళాకారులకూ, ఉపాధ్యాయులకూ, కార్యాలయోద్యోగులకూ, యువజనులకూ, చేతికళల పనివారికీ వర్తకులకూ, పారిశ్రామికులకూ, సామ్యవాదులకూ, ప్రజాస్వామికవాదులకూ, మితవాదులకూ, రాజకీయ, మతప్రసక్తి లేకుండా అందరికీ, తమ దేశాన్ని ప్రేమించేవారందరికీ, యుద్ధాన్ని వాంఛించని వారందరికీ, సుహృజ్జనులందరికీ యీ విధంగా విజ్ఞప్తిని చేస్తున్నాము :

అనునిత్యం యుద్ధప్రమాదాన్ని తీవ్రతరం గావిస్తూన్న, సామాన్యప్రజలైన మీపైని భారాన్నుంచుతోన్న అమితాయుధోత్పత్తిని అంతం చేయాలని కోరండి;

పరమాణు, ఉదజని ఆయుధాల తయారీనీ, ఉపయోగాన్ని నిషేధించమని కోరండి, దీనికి తొలిమెట్టుగా యీ ఆయుధాల పాటవ పరీక్షలను వెనువెంటనే ఆపమని కోరండి;

సైనిక కూటాల విధానాన్ని, యితర దేశాలలో సైనిక స్థావరాల స్థాపననూ అంతమొందించాలని కోరండి;

గత యుద్ధానికి ముఖ్యంగా బాధ్యులైన జర్మన్ సైనిక వాదులు, యూరప్ మధ్యభాగంలోనే తిరిగి ఆయుధధారణ చేయడానికి సమ్మతించరాదని కోరండి;

మధ్యప్రాచ్యంలో సామ్రాజ్యవాదుల కుట్రలు సైనిక కవ్వింపు చర్యలు అంతం కావాలని కోరండి;

సమిష్టి భద్రత, విభిన్న సాంఘిక వ్యవస్థల శాంతియుత సహజీవనం, సకలప్రజల అత్యంత విస్తృతమైన ఆర్థిక సాంస్కృతిక సహకార విధానాన్ని బలపర్చండి.

మీ అందరికీ మేమీదిగువ విజ్ఞప్తిని చేస్తున్నాం: మిత్రరాజ్యసమితిలో శాంతి విధానాన్ని, ప్రచ్ఛన్న యుద్ధ వ్యతిరేక విధానాన్ని అవలంబించమని మీ ప్రభుత్వాలను కోరండి.

సర్వప్రపంచంలోని సుహృద్భావులందరికీ మేమీవిధంగా విజ్ఞప్తి చేస్తున్నాము.

ఈ దిగువవాటిని ఆర్గనైజ్ చేయండి, వాటికొరకు కృషిచేయండి :

1. పరమాణు, ఉదజని ఆయుధాల పాటవ పరీక్షలను వెంటనే ఆపుటకొరకు,

2. ఈ ఆయుధాల తయారీనీ, ఉపయోగాన్ని నిర్నిబంధంగా వెనువెంటనే నిషేధించుటకొరకు;

కమ్యూనిస్టులమైన మేము సామ్యవాద ఆదర్శం కొరకు మా జీవితాలను అంకితం చేశాము, ఈ ఉన్నత ఆదర్శం జయిస్తుందని కమ్యూనిస్టులమైన మేము దృఢంగా విశ్వసిస్తున్నాము. మా భావాలు – మార్క్స్, లెనిన్ భావాలు—శ్రామిక వర్గ అంతర్జాతీయతా భావాలు జయిస్తాయని మేము విశ్వసిస్తూవుండడంవల్లనే, మేము శాంతిని వాంఛిస్తున్నాము, శాంతి కొరకు కృషి చేస్తున్నాము. యుద్ధం మా శత్రువు.

ఇప్పటినుండీ విభిన్న సాంఘిక వ్యవస్థలు గల దేశాలు, శాంతికొరకు విజ్ఞానశాస్త్రాన్ని, సాంకేతిక విద్యనూ పెంపొందజేయడంలో ఒకదానితో ఒకటి పోటీని చేయునుగాక.

తమ ఆధిక్యతను యుద్ధరంగంలోగాక, ప్రగతికొరకు పోటీలో, జీవన ప్రమాణాలను పెంచడానికి పోటీలో వారు ప్రదర్శించుకొందురుగాక.

సుహృద్భావులందరికీ మేము మా స్నేహ హస్తాన్ని చాచుతున్నాము. ప్రజలను పీడించే ఆయుధాల భారాన్ని, సమిష్టి కృషిలో వదిలించుకుందాము. యుద్ధ, మరణ, వినాశన ప్రమాదాలనుండి ప్రపంచాన్ని విముక్తి గావిద్దాము. మానవ కోటి అభ్యుదయానికి పురోగమించే ఉజ్జ్వల, ఆనందకర భవిష్యత్తు మనముందున్నది,

ప్రపంచంలో శాంతి నెలకొనునుగాక !

ఆల్బేనియా, ఆల్జీరియా, అర్జెంటైనా, ఆస్ట్రేలియా, ఆస్ట్రియా, బెల్జియం, బొలీవియా, బ్రెజిల్, బ్రిటన్, బల్గేరియా, కెనడా, సింహళం, చిలీ, చైనా, కొలంబియా, కోస్టారికా, క్యూబా, చెకోస్లొవేకియా, డెన్మార్క్, దొమినికా రిపబ్లిక్, ఈక్వెడార్, ఫిన్లండ్, ఫ్రాన్స్, జర్మన్ ప్రజాస్వామిక రిపబ్లిక్, జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్, గ్రీసు, గౌతెమలా, హంగెరీ, హాండురాస్, భారతదేశం, ఇండొనేషియా, ఇరాక్, ఇస్రెయిల్, ఇటలీ, జపాన్, జోర్డాన్, కొరియా, లగ్జెంబర్గ్, మలయా, మెక్సికో, మంగోలియా, మొరక్కో, నెదర్లాండ్స్, న్యూజిలాండ్, నార్వే, పనామా, పెరుగ్వే, పెరూ, పోలెండు, పోర్చుగల్, రుమేనియా, శాన్ మరినో, సోవియట్ దేశం, స్పెయిన్, స్వీడన్, స్విట్జర్లాండ్, సిరియా మరియు లెబనాన్, థాయ్‌లాండ్, ట్యునీషియా, టర్కీ, ఉరుగ్వే, వెనిజులా, వియత్నాం, యుగోస్లావియా కమ్యూనిస్టు, కార్మిక పార్టీల ప్రతినిధి వర్గాలచే ఆమోదింపబడినది.

# ఉన్నత సాంకేతిక స్థాయి


## వి. ఇ. ద్యమిషిత్స్

*భిలాయ్ ఇనుము, ఉక్కు పరిశ్రమాగారపు చీఫ్ ఇంజినీర్*




మిస్టర్ వి. ఇ. ద్యమిషిత్స్, చీఫ్ ఇంజినీర్

భిలాయ్ ఇనుము, ఉక్కు యంత్రాగారం యొక్క డిజైను, నిర్మాణపు పని అత్యున్నత సాంకేతికస్థాయికి చెందివున్నాయి. ఈ యంత్రాగారానికి సంబంధించిన సమస్త సాంకేతిక విషయాలు, వివిధ షాపుల నిర్మాణానికి సంబంధించిన విషయాలు ముందుగా సోవియట్ ఇనుము, ఉక్కు యంత్రాగారాలలో సమగ్రంగా పరిశీలింపబడ్డాయి.

భిలాయ్ యంత్రాగారపు షాపులన్నింటిలోని ఉత్పత్తి క్రమంలో యాంత్రీకీకరణ, స్వయం చలనీకరణ పద్ధతులు విస్తృతంగా చేకూర్చబడుతాయి. అత్యాధునిక కంట్రోలు, కొలత పరికరాల ఉపయోగంవల్ల ఉత్పత్తి యొక్క సాంకేతిక స్థాయిని నిరంతరం పెంపొందజేయడం సాధ్యమవుతుంది.

ఈ ఇనుము, ఉక్కు యంత్రాగారం కోక్ ఓవన్ బ్యాటరీలతో, శక్తివంతమయిన బ్లాస్ట్ ఫర్నెస్‌లతోను, ఓపెన్ హార్త్ ఫర్నెస్లతోను, రోలింగ్ మిల్లులతోను, ఒక ఎగ్లామరేషన్ షాపుతోను, ఒక ఫౌండ్రీ, ఒక మెకానికల్ షాపు, ఇంకా ఇతర శాఖలతోను కూడి ఉంటుంది.

భిలాయ్ యంత్రాగారం పూర్తయినతర్వాత సంవత్సరానికి 1,000 000 టన్నుల కడ్డీలను ఉత్పత్తి చేస్తుంది. కాని భవిష్యత్తులో దాని ఉత్పత్తి శక్తి ఇంకా అధికం కావచ్చు.

ఈ యంత్రాగారం రైలు పట్టాలను, నిర్మాణపు పనుల్లోను, యంత్రాల నిర్మాణంలోను, భారత జాతీయ ఆర్థిక రంగపు ఇతర శాఖల్లోను ఉపయోగించే వివిధ రకాల ఇనుప వస్తువులను తయారు చేస్తుంది.

ఈ యంత్రాగారపు కోక్ ఓవన్ బ్యాటరీలకొరకు రోజుకు 240 కారుల నిండా బొగ్గు అవసరమవుతుంది. ఆ బొగ్గంతా రెండు శక్తివంతమయిన డంప్ క్రెడిల్‌ల సహాయంతో ఎనిమిది గంటల్లోపల క్రిందికి దించబడుతుంది. ఈ విధంగా బొగ్గును క్రిందికి దించడం త్వరిత గతిని జరుగడమే గాక, అవసరమైన బొగ్గు సరఫరా సక్రమముగా కొనసాగుతుంది.

క్రిందికి దించబడిన బొగ్గు క్రాషింగ్ మెషిన్ దగ్గరికి బెల్ట్ కన్వేయర్లద్వారా పంపబడుతుంది. కోక్ ఓవన్ బ్యాటరీలకు అది పొడి రూపంలో సరఫరా చేయబడుతుంది. కోక్ ఓవన్లలో తాపక్రమం అత్యధికంగా (+ 1.000° సెంటిగ్రేడ్) ఉండి, ప్రాణవాయువు లోపించుతుండడంవల్ల బొగ్గు కోక్‌గా మారిపోతుంది. అది సిద్ధమయిన తర్వాత బ్లాస్ఫర్నెస్‌లకు గూడా కోక్ బెల్ట్ కన్వేయర్ల ద్వారా సరఫరా చేయబడుతుంది.

బ్లాస్ట్‌ఫర్నెస్ శాఖలో మూడు బ్లాస్ఫర్నెస్‌లు ఉంటాయి. వాటి కెపాసిటీ మొత్తం దుక్కఇనుము ఉత్పత్తికీ, ఫర్నెస్‌లకు సరఫరా చేయబడే కోక్ యొక్క షాకునుతట్టుకొనగల శక్తికీ అనుగుణ్యంగా లెక్కకట్టబడి తయారు చేయబడ్డాయి.

బ్లాస్ట్ ఫర్నెస్‌లన్నీ, వాటి నిర్మాణానికీ, వాటికి చేకూర్చబడిన పరికరాలకూ సంబంధించినంతవరకు సోవియట్ దేశపు ప్రశస్తమైన బ్లాస్టఫర్నెస్‌ల ననుసరించి డిజైను చేయబడ్డాయి. ఈ బ్లాస్టఫర్నెస్‌లు అద్భుతంగా పని చేస్తాయని ప్రపంచమంతటా పేరుబడ్డాయి. బ్లాస్టఫర్నెస్‌లలో ఎడతెరిపి లేకుండా పని కొనసాగడమూ, ఉత్తమ తరగతికి చెందిన దుక్క ఇనుము తయారు కావడమూ ముడి ఇనుము యొక్క డ్రెస్సింగ్ (దాని భౌతిక లక్షణాలు, మిశ్రిత రసాయని కూడిక) పైన ఆధారపడి ఉంటాయి.

1959 కల్లా చితుకగొట్టబడిన ముడి ఇనుమును కోక్‌గా తయారుచేసే ఒక ఎగ్లామరేషన్ షాపు నిర్మాణం పూర్తి అయి, పని ప్రారంభమవుతుంది. బ్లాస్ట్ ఫర్నెస్‌ల పనిని నిరాటంకంగా కొనసాగేట్లు చూడడము,

భిలాయ్ నిర్మాతలకు సాయపడడానికి పెద్ద పెద్ద క్రేన్లు వచ్చాయి



## నిర్మాతల మాటలు



మిస్టర్ బి. వొదొవిచెన్కొ
సింటరింగ్ ప్లాంటు ప్రత్యేక ప్రవీణుడు

"40 సంవత్సరాల మా ప్రభుత్వపాలనలో, సోవియట్ ప్రజలు, 200 000 నిర్మాణాలను నెలకొల్పి దేశాన్ని పరివర్తింప జేశారు. ఇప్పుడు, 100,000 పారిశ్రామిక సంస్థలు సోవియట్ దేశంలో నిర్మాణమవుతున్నాయి.

స్వతంత్ర భారత దేశపు పెద్ద పెద్ద నిర్మాణాలలో మొట్టమొదటిది భిలాయ్ ఉక్కు పరిశ్రమాగారం. భిలాయ్ కర్మాగారం, దాని నిర్మాణంలో శక్తివంచనలేకుండా ఏకాగ్రతతో కృషిచేస్తున్న మేము, అదొక్కటే కాదు. వేలకువేలు ఇతర భారీ పారిశ్రామిక నిర్మాణాలు స్వతంత్ర భారత రిపబ్లిక్కులో జరగాలని మేము ఆశిస్తున్నాము."

ఒక్కొక్క టన్ను దుక్క ఇనుముకు పట్టే కోక్‌ను తగ్గించడమూ యీ షాపు యొక్క పని. తత్ఫలితంగా బ్లాస్ట్‌ఫర్నేస్ శాఖ యొక్క ఉత్పాదక శక్తి పెంపొందు, దుక్క ఇనుము యొక్క ఉత్పత్తి ఖర్చులు తగ్గురాయి.

బ్లాస్ట్‌ఫర్నేస్‌లలోని లోహాన్ని పరిశుభ్రం చేసేపనిని తీవ్రతరం గావించడానికి ఒక్కొక్క బ్లాస్ ఫర్నేస్‌కు నిముషానికి 2,000 నుండి 3 000 క్యూబిక్ మీటర్ల గాలిని సరఫరా చేయడం అవసరము. ఈ పనికొరకు సమర్ధవంతమయిన "ఎయిర్ బ్లోయర్లు" (గాలికొట్టే యంత్రాలు) యంత్రాగారంలో చేకూర్చబడ్డాయి. ఈ యంత్రాలు స్థిరమైన ఆర్ద్రతకు 900° సెంటిగ్రేడ్ డిగ్రీల తాపక్రమాన్ని కలిగి వున్న కంప్రెస్డ్ గాలిని ఉత్పత్తి చేస్తుంటాయి.

కోక్ ఉపయోగాన్ని తగ్గించడానికీ, బ్లాస్ట్ ఫర్నేస్‌లు పనిచేస్తున్నప్పుడు వెలువడే వాయువులోని దుమ్మును తగ్గించడానికి, ఇనుమును పరిశుభ్రం చేసేసమయంలో వాయువు మరింత యెక్కువ వత్తిడితో వదులబడుతుంది.

ఓపెన్-హెర్త్ ఫర్నేస్‌ల శాఖలో ఆరు ఫర్నేస్‌లు ఉంటాయి. ఒక్కొక్కటి 250 టన్నుల కెపాసిటీని కలిగిఉంటూ సంవత్సరానికి 1,000 టన్నుల ఉక్కు పాళాములను ఉత్పత్తి చేస్తాయి.

ప్రాణవాయువు ఉపయోగంవల్ల ఉక్కు ఉత్పత్తి క్రమం మరింత తీవ్రతరం గావింపబడుతుంది. ఈ పద్ధతి యీమధ్య సోవియట్ దేశంలోను, ఇతర దేశాలలోను విస్తృతంగా ప్రవేశపెట్టబడింది. ఓపెన్ హెర్త్ ఫర్నేస్ ఉక్కు ఉత్పత్తి క్రమంలో ప్రాణవాయువును ఉపయోగించే పద్ధతి ప్రవేశపెట్టబడడంవల్లనూ, సమృద్ధికరమైన గాలి కరిగిన ఉక్కులోకి సరాసరిని విడువటం వల్లనూ ఓపెన్-హెర్త్ ఫర్నేస్‌ల ఉత్పాదక శక్తి బాగా పెంపొందుతుంది. ఈ విషయంలో "జపొరొజస్తల్" ఇనుము, ఉక్కు యంత్రాగారపువని ఆదర్శ

ప్రాయమైనది. ఈ యంత్రాగారపు ఓపెన్ హెర్త్ ఫర్నేస్‌లు ప్రతి మూడు, నాలుగు గంటలకొకసారి ఉక్కును ఉత్పత్తిపరుస్తూ ప్రపంచపు రికార్డును స్థాపించాయి.

భిలాయ్ ఇనుము, ఉక్కు యంత్రాగారానికి నాలుగు రోలింగు మిల్లులు ఉంటాయి: అవి, ఒక బ్లూమింగ్ మిల్లు, ఒక కంటిన్యూ వెస్ బిల్లెట్ మిల్లు, ఒక రైల్ ఎండ్ స్ట్రక్చరల్ స్టీల్‌మిల్లు, ఒక ప్రొఫైల్డ్ స్టీలు మిల్లు.

పరిశ్రమకు ఒక పెద్ద బ్లూమింగు మిల్లు అవసరం కలగడం ఉత్పత్తి మొత్తాన్నిబట్టి మాత్రమేకాదు; పరిశ్రమ భావిఅభివృద్ధికొరకు ఎక్కువగా రిజర్వులు కావాలన్న వాంఛవల్ల కూడా కలిగింది. స్వెర్డ్‌లోవ్‌స్క్‌లోని ఉరల్ యంత్రనిర్మాణ పరిశ్రమ కార్మికులు, అనుకున్నదానికి ముందుగానే భిలాయ్ కోసరం బ్లూమింగు మిల్లును తయారుచేయడం పూర్తి చేశారు. వాటిలో కొన్ని భాగాలు యిప్పటికే పంపబడ్డాయి.

రైలు, స్ట్రక్చరల్ మిల్లుకు, లోహానికి మెకానికల్ ట్రీట్‌మెంటు యిచ్చేందుకు, ఒక ప్రత్యేకమైన విభాగం చేర్చబడుతుంది. రైలు పెద్దుల మన్నికను ఎక్కువ చేసేందుకు అవి తక్కువ బరువులను మోస్తూవున్నప్పుడు—, వాటిని హైఫ్రీక్వెన్సీ విద్యుత్తుతో చికిత్సచేయడానికి ఏర్పాట్లు చేయబడ్డాయి.

బ్లాస్ట్ ఫర్నేస్‌లు నిర్మితమవుతున్నాయి.
రెండవ బ్లాస్ట్ ఫర్నేస్ పునాదికూడా సిద్ధమయ్యింది



భిలాయ్ ఇనుము, ఉక్కు పరిశ్రమను డిజైన్ చేసేటప్పుడు, చాలా కర్మాగారాల్లో అత్యంత ఆరోగ్యకరమైన పరిస్థితులను ప్రవేశపెట్టడానికి ప్రత్యేకమైన శ్రద్ధ చూపబడింది. ధారాళంగా గాలి వచ్చేందుకు, ఎయిర్ కండిషనింగ్‌కు, గాలినుండి ధూళిని, గ్యాసును తొలగించేందుకూ, బ్లాస్ట్ ఫర్నేసుల నింకను అదుపులో పెట్టేందుకు, ఓపెన్ హార్త్ ఫర్నేసులలో ఉష్ణోగ్రతా క్రమాలనూ, రోలింగుమిల్లు మెకానిజమ్స్ మొదలైన వాటినీ అదుపులో పెట్టేందుకు ప్లాను చేయబడింది.

బ్రహ్మాండమైన భిలాయ్ ఇనుము ఉక్కు పరిశ్రమకు యాంత్రిక, ఎలెక్ట్రో-మరమ్మత్తు పని, ఫౌండ్రీవంటి పెద్ద సహాయక శాఖ లుండడంవల్ల క్రమబద్ధంగా బాగా సాగిపోతుంది.

భిలాయ్ ఇనుము, ఉక్కు పరిశ్రమ పూర్తి కావడనికి, అత్యల్ప కాలంలో నిర్మాణంలో పెద్ద మొత్తమూ, అసెంబ్లింగ్ పని, యితర విధాలైన ప్రత్యేక పని నెరవేర్చవలసి వుంటుంది. సోవియట్, భారతీయ ప్రవీణులు అనేక సాంకేతిక, ఇంజినీరింగు మొదలైన సమస్యలను—దీని ఫలితంగా ఉత్పన్నం అయ్యే వాటిని—పరిష్కరించడానికి కృషిచేస్తారు.

నిర్మాణ కార్మికులు ఏభై లక్షల క్యూబిక్ మీటర్ల మట్టిని త్రవ్విపోయడమూ, ఐదు లక్షల క్యూబిక్ మీటర్ల కాంక్రీటును క్లిష్టమైన ఇంజినీరింగు నిర్మాణాలలో పోయడమూ చేయవలసి వుంది. వారు 120 కిలోమీటర్ల రైల్వేలనూ, రహదారులనూ, వివిధ వ్యాసాలు గల పైపు లైన్లనూ వేయవలసి వుంది. లక్ష టన్నులకు పైగా అసెంబ్లీ స్ట్రక్చర్లు, సామగ్రి, రిఫ్రాక్టరీ లైనింగు యిప్పటికే సోవియట్ దేశంనుండి పంపబడ్డాయి. లక్షలాది టన్నుల కొత్త సామన్లతో ప్రతినెలా సోవియట్ వర్తక నౌకలు భారత దేశానికి వస్తున్నాయి. లోహపు వస్తువులలో కొంతభాగం బొంబాయి, కలకత్తా నగరాలలో తయారు చేయబడుతూ వుంది.

నిర్మాణానికి కొద్దికాలం మాత్రమే నిర్దేశింపబడడంవల్ల, వివిధ నిర్మాణపు పనులు, అసెంబ్లీ పనులూ ఏకకాలంలో చేయవలసి వస్తోంది. ఉదాహరణకు ప్రస్తుతం, బ్లాస్ట్ ఫర్నేసులను నెలకొల్పడానికి నిర్ణయింపబడిన స్థలంలో లోహపు నిర్మాణాలనూ, రిఫ్రాక్టరీ లైనింగునూ అమర్చడమూ ఏక కాలంలో సాగుతూ వున్నాయి. కోక్ ఓవెన్ బ్యాటరీల, లోహ నిర్మాణ శాఖ మొదలైనవాటి యొక్క నిర్మాణానికి ఒక ప్రత్యేకమైన కాలక్రమం నిర్ణయింపబడింది కూడా.

భిలాయ్ ఇనుము, ఉక్కు పరిశ్రమలో చాలా ముఖ్యమైన సాంకేతిక నిర్మాణ సూత్రం అనుసరింపబడుతూ వుంది; అంటే పెద్ద భాగాల కూర్పు నిర్మాణ స్థలంలో కాకుండా, యీ భాగాలను సరఫరా చేసే ఫాక్టరీలలోనూ షాపులలోనూ సాగుతుంది.

నేలపైని వివిధ భాగాలు కూర్చబడతాయి; వాటి మొత్తం బరువు సుమారు 25 టన్నులకు పోయినప్పుడు కావలసిన స్థలానికి అది పైకి పంపబడుతుంది. సామగ్రి కూర్పు యిదే విధంగా జరపడానికి ప్లాను చేయబడింది.

కాంక్రీటు ప్లాంట్



## నిర్మాతల మాటలు



శ్రీ చంద్రశేఖర్
డివిజనల్ ఇంజనీర్ (రిఫ్రాక్టరీస్),
బ్లాస్ట్ ఫర్నేస్ ప్లాంటు

"భారతీయ ఇంజనీర్లమైన మేము, ఇదివరలో విదేశ నిపుణులతో కలసి పనిచేశాము. అయినా, భారత చరిత్రలో ప్రప్రథమంగా, నవీన సాంకేతిక రీతులను అభ్యసించడానికి సోవియట్ దేశం విపులావకాశాన్ని కల్పించింది.

"అభివృద్ధి చెందిన దేశాలు" అనబడే వాటిలో భారతీయులు మంచిపనివాళ్ళు కాదని బహుళంగా చెప్పబడుతున్నది. ఈ అభిప్రాయం పూర్తిగా తప్పు. ఇతరులతో మనం సమానప్రతిపత్తిమీద కలసి పనిచేసినట్టయితే ఇతరులలాగాగే నేర్చుకొని, అర్థం చేసుకొనగలుగుతాము. నేను భిలాయ్‌లో చూస్తున్నదంతా మరోసారి నా నమ్మకాన్ని దృఢపరుస్తున్నది."

ఇందు నిమిత్తం నిర్మాణ స్థలంలో వివిధ కెపేసిటీలుగల శక్తివంతమైన హాయిస్టింగ్ క్రేన్లున్నాయి. ఉదాహరణకు బ్లాస్ట్ ఫర్నేసుల అసెంబ్లీ పని, 65 మీటర్లకన్నా, 25 టన్నుల కెపేసిటీ గల టవర్ క్రేన్ సహాయంతో జరుగుతోంది. ఇదే రకపు క్రేన్లు యితర స్థలాలలో కూడా నెలకొల్పబడుతున్నాయి.

నిర్మాణస్థలంలో అసెంబ్లీ పని పెద్దపెట్టున జరగడానికి కారణం, సోవియట్ దేశంలో తయారుచేయబడిన చాలా భాగాలు, వాటిని భారత దేశానికి పంపడానికి ముందర అవి తయారుచేయబడిన ఫాక్టరీలలో సరిచూసేందుకు కూర్చబడడమేనని యిక్కడ చెప్పవలసి వుంటుంది.

సోవియట్ దేశంనుండి వస్తోన్న లోహ నిర్మాణ భాగాలన్నీ వెల్డుచేయబడ్డాయి. నిర్మాణ స్థలంలోని కర్మాగారాలన్నిట్లో వెల్డింగు విస్తారంగా ఉపయోగింపబడుతోంది. ఇందువల్ల లోహ నిర్మాణాల బరువు తగ్గింది. అంచేత వాటి ఖర్చు తగ్గింది. నిర్మాణస్థాయి హెచ్చింది.

ప్రస్తుతం ఎయిర్ హీటర్లు, గ్యాస్ స్క్రబ్బర్లు, మొదటి బ్లాస్ట్ ఫర్నేసు వెల్డుచేయబడుతున్నాయి. ఇది భారత దేశంలోని వెల్డు చేయబడిన మొదటి బ్లాస్ట్ ఫర్నేస్ అవుతుంది. వెల్డింగు సీమ్స్ యొక్క నాణ్యపు ఎక్స్-రే కంట్రోలు ప్రవేశపెట్టబడుతుంది. సోవియట్, భారతీయ వెల్డర్లచే అతి ముఖ్యమైన లోహ నిర్మాణాల వెల్డింగు చేయబడుతూ వుంది.

భారతీయ నిర్మాణ సంస్థలు ప్రోజెక్టులోని పనిలో పాల్గొంటున్నాయి, యిందులో ఒక భాగం పరిశ్రమలోనే నిర్వర్తించబడుతోంది.

ఈ సంస్థలన్నిటిలోకీ పెద్దది "హిందుస్థాన్ కన్‌స్ట్రక్షన్ కంపెనీ." ఇంజినీరింగు సమస్యలకు సంబంధించినంతవరకూ అన్ని ముఖ్యమైన, క్లిష్టమైన కర్మాగారాల నిర్మాణం మొదలైన పనులకు, భూగర్భంలో నుండి కమ్యూనికేషన్స్ స్థాపనకూ, రహదారులూ, ఆ స్థలంలో ప్లానింగుకూ బాధ్యత వహిస్తుంది.

హిందుస్థాన్ కన్‌స్ట్రక్షన్ కంపెనీ, యింకా చాలా సంస్థలూ చాలా ఉన్నతమైన నాణ్యం గల కాంక్రీటు పనులను చేస్తాయనీ, వాటి ప్రీఫాబ్రికేటెడ్ కేసింగ్, వాటి కూర్పు పద్ధతులూ చాలా కుతూహలజనకంగా వుంటవనీ, అవి విస్తారంగా అమలు జరపవలసిన అర్హత గలిగినవనీ చెప్పవలసి వుంది. సోవియట్ ఇంజినీర్లు తమ భారతీయ సహోద్యోగుల అనుభవాన్ని గౌరవిస్తారు, చాల విలువైన దానిగా పరిగణిస్తారు.

ఉష్ణ మండలంలో లోహపరిశ్రమ నిర్మాణం చాలా కష్టభూయిష్టమైనది. కాని ప్రాజెక్టు పనివారు జయప్రదంగా దానిని గడిచి గట్టెక్కుతున్నారు, యీసంవత్సరంలోనే ఎండల్లోనూ, వానల్లోనూ నిర్మాణాన్ని సాగిస్తున్నారు.

## నిర్మాతల మాటలు



మిస్టర్ వి. గొరజ్జీ
సోవియట్ ఇంజనీర్, బ్లాస్ట్ ఫర్నేస్ నిర్మాణం

"భారతీయ ప్రజలకు భిలాయ్ ఉక్కు పరిశ్రమాగారం ఎంతప్రయోజనకారి కాగలదో మాకు బాగా తెలుసు. అందువల్లనే ఒక్క నిమిషం కూడా వృథా చెయ్యకుండా మేము అవిశ్రాంతంగా పనిచేస్తున్నాము."

## నిర్మాతల మాటలు



శ్రీ రామచంద్రరావు,
బ్లాస్ట్ ఫర్నేస్, కోక్ ఓవెన్ ప్లాంట్ల ప్రాజెక్ట్ ఇంజనీరు

"రష్యన్లు ఇచ్చిన ప్లానులు (బ్లూ ప్రింట్స్) నాకెంతో ఇష్టం. అవి జూనియర్ ఇంజనీర్లకుకూడా సుబోధకంగా ఉంటాయి. నిర్మాణపు సాంకేతిక నిర్వహణాన్ని రష్యన్లు సమర్థనీయంగా కొనసాగిస్తున్నారు.

గత నలభై ఏళ్ళలో సోవియట్ ప్రజలు తమ ఆర్థిక వ్యవస్థను ఎంతో అభివృద్ధి చేశారు. దానిని ఒక అభివృద్ధి చెందిన ఆర్థిక వ్యవస్థగా పరివర్తింపజేశారు. వారు మనకొక చక్కని ఆదర్శం."

# ఖిలాయ్‌కి సరుకులు దిగుమతి

వి. కొసొనొగీ, ఇ. పెచెంక్
ఒడెస్సా నౌకాశ్రయ వార్తాపత్రిక
"మోర్యక్" విలేఖరులు




ఒడెస్సా రేవులోని నౌక, "జలకేంద్ర"

ఒడెస్సా రేవులో కాంక్రీటుతో కట్టబడిన ఓడ దొరువులు (డాక్స్) అనేక కిలోమీటర్ల పొడవున కనిపిస్తాయి రేవులోని, వివిధ దేశాల పతాకలతో అలంకృతమైవున్న నౌకలకు సరుకులెత్తుటలో పెద్దపెద్ద క్రేనులు, స్వయంచోదక లోడింగ్ యంత్రాల బెల్టులు, రేవులో సరుకులు నింపి, ఓడల పంపువారికి త్వరగతిని సహాయపడు తుంటాయి.

పని రాత్రింబవళ్లు సాగిపోతుంటుంది. రేవు సరుకుల దొడ్డిలో పెట్టిన సరుకుల మీద, "రష్యాలో తయారుచేయబడినవి" అని వ్రాయబడివుంది. అవిభారత దేశంలోని విశాఖపట్నం మీదు ఖిలాయ్‌కిపంపబడుతున్నాయి. సోవియట్ భారత నౌకా మార్గం గుండా నిరంతరం సరుకు ఓడలమీద రవాణాఅవుతున్నది.

సోవియట్ దేశం ఇప్పటికే భారతీయ రేవులకు వేలాదిటన్నుల సరుకు రవాణా చేసింది. భారత రిపబ్లిక్కుకు రవాణాకని నిర్దేశించబడిన నూతన సామగ్రి నల్ల సముద్ర రేవులకు రైలు మార్గంద్వారా నిరంతరంగా వస్తున్నది.

ఆకాశం మేఘావృతమై, పూర్వోత్తర పవనాలు జోరుగా వీస్తున్నప్పుడు, సరుకుల ఎత్తడం ఎంతోకష్టతరమైన విషయం. వాతావరణం ప్రతికూలంగా వున్నప్పటికి ఒడెస్సా ఓడ కళాసీలు ఎంతో పరిశ్రమించి, భారత నౌక "జలకేంద్ర"ను రేవులోని ప్రథమ ఘట్టానికి త్వరగతిన తరలించారు.

ఛీఫ్ మేట్ గదిలో భారత నావికులు, సోవియట్ రేవు పనివారు కలిసి, సరుకు రవాణాకు ఒక పథకాన్ని వేశారు. ఇంతలో, కార్మికులు సరుకుల పెట్టెలు తెరచి, వాటిమీద చుట్టిన కాన్వాస్ కట్లు విప్పి, పెద్ద పెద్ద బీములు మొదలైనవాటిని సరుకు పట్టిక ప్రకారం సరిచూడ మొదలుపెట్టారు. క్రేనులు వెనువెంటనే పనిచేయ ప్రారంభించాయి. బ్లాస్ట్ ఫర్నెస్ సామగ్రివున్న పెద్దపెద్ద పెట్టెలను యథారీతిని ఓడ కళాసీలు బిగింపు చేశారు. దళనాయకులు షో-ల్లెంకో, తిగిస్వాజ సంకేత సూచికనిచ్చేసరికి, ఆపెద్ద పెద్ద సరుకు రెత్తు యంత్రాల ఉక్కు కేబుళ్ళపైనుంచ క్రేట్లు బరువైన సరుకులను అవలీలగా ఎత్తి వాటిని పెట్టవలసిన తెరచుకొనివున్న అమరికలలోనికి దింపుతున్నాయి.

సంధ్యా సమయాన, భారతీయ నావికులు ఓడమీద సరుకులు పెట్టవలసిన చోట్ల దీపాలు వేశారు. సరుకులు పెట్టవలసిన చోట్లకు 'జలకేంద్ర' నౌక ప్రథమాధికారి, వాటిని అమర్చుటలో సోవియట్ దళ నాయకునికి సహాయపడడానికి తరచు వెళ్ళారు. సరకులను ఎక్కించుటలో జాగ్రత్త తీసుకోవడం ఎంతో ముఖ్య విషయం, ఎందుచేతనంటే ఓడ తుఫానులను దాటి ఎంతో దూరప్రయాణం చేయవలసి వున్నది.

ఒడెస్సా రేవు కళాసీలు, ఒడెస్సా ప్రజలూ భారతీయ నావికులకు ఘన స్వాగత మిచ్చారు. ఓడ రేవులో వుండగా, నౌకా దళ సభ్యులు నగరాన్ని పర్యటించారు. ఈ పర్యటనలో వారికి, 'విదేశనావిక సహాయక సమితి' సభ్యులు ఎంతో తోడ్పడ్డారు.

కొందరు సమిష్టి క్షేత్రాన్ని సందర్శించారు. కొందరు ఫ్యాక్టరీని చూడడానికి వెళ్ళారు. అనేకులు నాటకశాలలను, సినిమా ప్రదర్శన శాలలకు, స్టేడియంలకు వెళ్ళారు.

సోవియట్ నావికులు, తమకు భారత రేవు పట్టణాలు విశాఖపట్నం, మద్రాసు, కలకత్తా, బొంబాయిలలో ఇవ్వబడిన ఘన స్వాగతాల గురించి చెప్పడానికి ఎంతో ఉత్సాహపడుతుంటారు. నల్ల సముద్రపు స్టీమ్‌షిప్ కంపెనీకి చెందిన ఓడలు, "ఎడ్మిరల్ ఉషకోవ్." "క్రాస్నోదార్," "ఇస్మెయిల్," పైన చెప్పిన ఆ రేవుపట్టణాలకు వేలాది టన్నుల ఖిలాయ్ సరుకును రవాణా చేసి, సోవియట్ రేవు పట్టణాలకు భారత వస్తుసంచయాన్ని తేయాకు, కాయలు, జోళ్ళు తీసుకవచ్చాయి.



సరుకుల పెట్టెలను దింపుతున్న కేటర్ పిల్లర్ క్రేన్.



భారతీయ రిఫ్రాక్టరీ తాపీపనివారికి ప్రాయోగిక శిక్షణనిస్తోన్న దృశ్యం

# భిలాయ్

# భారతీయ నిపుణులకు ఉత్తమ శిక్షణాలయం

హెచ్. వత్స

భిలాయ్ ఉక్కు పరిశ్రమ నిర్మాణ స్థలానికి తొలిసారిగా వెళ్ళడం, మంచి ఉత్సాహకరమైన అనుభవం. ఆ వాతావరణం, అంతా చకచకా జరిగిపోతూ వుండడం. అంతా తక్షణం జరిగిపోవాలన్న కార్యనిమగ్నత—వీటి ప్రవాహంలో మీరూ కొట్టుకపోతారు. పనులు ఎంత తొందరగా సాగిపోతూవున్నవంటే, రవ్వంతైనా తెలియకుండానే మీరూ నేటి భిలాయ్ విశాలమైన యంత్రాంగంలో ఒక భాగమైపోయి, ఉత్త బంజరుగా పడివున్నచోట నవభారతం సృష్టి జరుగుతూ వుండడం చూస్తూ, చప్పుచప్పున సాగిపోతారు.

సోవియట్ సాంకేతిక సిబ్బంది, భారతీయులు కలిసి మెలిసి పనిలో లీనమై కృషి చేస్తున్నారిక్కడ....

ఇక్కడ నేను విన్న సమాచారం అంతటి ప్రకారం, సాంకేతిక సిబ్బందికి శిక్షణను యివ్వడంలోనూ, వారికి వస్తుజాలాన్ని సమకూర్చడంలోనూ భిలాయ్ భారత దేశానికి అపారంగా సహాయపడగలదని స్పష్టమవుతుంది. సోవియట్ దేశానికిగల సాంకేతిక ప్రావీణ్యమూ, ఉక్కు పరిశ్రమలను నిర్మించడంలో అపారమైన అనుభవమూ, భిలాయ్‌లో భారత దేశ సేవకు వినియోగింపబడ్డాయి. భారతీయులు దీనిని పూర్తిగా వినియోగించుకుంటూ వున్నట్టుగా కనిపిస్తోంది. సోవియట్ సిబ్బంది ఎంతమాత్రమూ పెత్తనాన్ని చెలాయించడంగాని, దర్పాన్ని ప్రదర్శించడం కాని నాకు ఎక్కడా కనిపించలేదు. సర్వత్రా కనిపించే ఉత్సాహమూ, సహకారభావమూ చూసి తీరవలసిన విషయం.

## "వృత్తిరహస్యా"లేవీ లేవు

ఎంతోమందితో మాటాడిన తరవాత, సోవియట్ ప్రవీణులు "వృత్తి రహస్యాలు" వేటినీ దాచిపెట్టుకోవడం లేదనికూడా నేను తెలుసుకున్నాను. సమాచారమంతా నిరాటంకంగా యివ్వబడింది. నేను కలుసుకున్న శిక్షణను పొందుతోన్న పట్టభద్రులుగాని, సోవియట్ దేశం నుండి తిరిగివచ్చిన సీనియర్ ఇంజినీర్లుగాని, నిర్మాణ ప్రదేశంలో పనిచేస్తోన్న సిబ్బందిగాని—ఎరందరూ తమకు తెలియకుండా ఏదీ ఎన్నడూ దాచిపెట్టబడడం లేదని అంటున్నారు. వీరిలో చాలామంది చెప్పినదాని ప్రకారం, సోవియట్ ఇంజినీర్లతోనూ, సాంకేతిక ప్రవీణులతోనూ కలసి పనిచేస్తూ తాము చూసిన కొత్త హంశం యిది; ఇది పనిని సుగమం, సులభతరంచేసి, సోవియట్, భారతీయ సిబ్బందులలో ఏకతాభావాన్ని కలిగించిందనడం స్పష్టం.

అధ్యయన యాత్రకు సోవియట్ దేశానికి వెళ్ళిన భారతీయ సీనియర్ ఇంజినీర్లతో నేను మాటాడినప్పుడు యిది నాకు బాగా అవగతమైంది. యం. కె. మెహతా, వి. కె. రాజగోపాలన్, ఆర్. ఎన్. కౌల్, కె. సి. మోహన్—వీరందరూ భిలాయ్‌లోని వివిధ పనిశాఖలకు బాధ్యులైన ఇంజినీర్లు—తాము సోవియట్ దేశంలో వున్నప్పుడు తమకు పూర్తిసహకారం లభించిందనీ, తమకు అవసరమైన సాంకేతిక విషయాలన్నీ సేకరించుకోవడానికి వీలు కల్పింపబడిందనీ ఏకగ్రీవంగా తెలియజేశారు. సాంకేతిక, యాంత్రిక క్రమాలన్నిటినీ చూడడానికీ, అవగాహన చేసుకోవడానికీ వారికి పూర్తిగా అవకాశాలు లభించాయట. ఏపారిశ్రామిక సంస్థకైనా గర్భగుడివంటిదైన డిజైన్ బ్యూరోకు సంబంధించిన వివిధహంశాలను వారు క్షుణ్ణంగా పరిశీలించారు కూడా. వారికి లాభించిన ఒక ముఖ్యవిషయమేమిటంటే—డిజైన్ సంస్థ ఎలా నెలకొల్పబడుతుంది, దానికి ప్రధానంగా కావలసినవి ఏమిటి అన్నవాటిని వారు తెలుసుకున్నారు, వివిధ శాఖల ప్రత్యేకతలను అవగతం చేసు

### నిర్మాతల మాటలు

మిస్టర్ ఎ. ఖ్రెనోవ్

"నా జీవితంలో బాగా పనిచేసిన కాలంలో, నేను అనేకమంది వెల్డర్లను తర్ఫీదు చేశాను. కాగా పని నేర్చుకోవడంలో భారతీయులు మంచి నిపుణులని నేను చెప్పగలను. కొందరు, మాలాగానే బ్లాస్ట్ ఫర్నెస్ వెల్డింగ్ పనిని చక్కగా నిర్వహించగలుగుతున్నారు. మంచి నైపుణ్యం, ప్రావీణ్యం కలిగిన పనివారే యీ పనిని నెరవేర్చగలరు."



## నిర్మాతల మాటలు

శ్రీ కె. సుబ్బరామన్
చీఫ్ ఇంజనీర్, ఐ.ఆర్.ఎస్.ఇ.

"భిలాయ్ ఉక్కు పరిశ్రమాగారం భారతీయ నిపుణులకు ఒక చక్కటి శిక్షణా కేంద్రం. ఇక్కడ తర్ఫీదైన నిపుణులు, మనకు భిలాయ్ ఉక్కు కన్నా ఎంతో ఎక్కువగా ఉపకరిస్తారని నా వ్యక్తిగత విశ్వాసం."



డిజైన్ బ్యూరో లేదనీ. భవిష్యత్తులో యీ దేశంలో ఒకదానిని నెలకొల్పడానికి యీ సీనియర్ ఇంజినీర్లు తోడ్పడడానికి ఆశిస్తున్నారనీ నాకు తెలిసింది. వీటన్నిట్లోకీ పెద్దలాభం, భిలాయ్ ఉక్కుమిల్లు గురించి వారు సంపూర్ణంగా తెలుసుకోవడం. ఇక్కడి ప్రత్యేకావసరాల దృష్ట్యా వీటినే వారు చేస్తారు గాబట్టి యిది పెద్ద లాభం అన్నాను. భిలాయ్‌లో సోవియట్ ప్రవీణులతోనూ, నిపుణులతోనూ పనిచేస్తూ యిదే స్నేహపూర్వక సహకారాన్ని వారు చూశారు.

### భారతీయ నిపుణ కార్మికులకు లాభం

భారతీయ నిపుణ కార్మికులు కూడా యిది అత్యంత లాభదాయకమైనదానిగా భావించి, సత్వరంగా పని పద్ధతులలో కొత్తవాటినీ, తొందరగా జరిగే వాటినీ నేర్చుకున్నారు. పూర్వం వెల్డింగులో అనుభవంగల కొంతమంది భారతీయ వెల్డర్లు, తాము ఉపయోగించే వెల్డింగుకు భిన్నమైన రష్యన్ హారిజాంటల్, వెర్టికల్ వెల్డింగు పద్ధతులనే స్వీకరించామని చెప్పారు. వారు చెప్పినదాని ప్రకారం, ఎక్స్-రే చేసేందుకు, వేగానికీ రష్యన్ పద్ధతి చాలా మంచిది.

ఒకరిభాష ఒకరికి తెలియకుండా ఎలా కలిసి పనిచేస్తున్నారని నేనడిగితే, భారతీయ వెల్డర్లు శ్రీ గుప్తె, శ్రీ ఘోష్ తమతో పని చేసే రష్యన్లకు నాలుగేనాలుగు ఇంగ్లీషుమాటలు తెలుసుననీ, పనికి సంబంధించినంతవరకూ అవి చాలుననీ అన్నారు. ఆ మాటలేమిటంటే—బాగుంది, చాలాబాగుంది, పూర్తిచేయండి, బాగాలేదు. ఈ కొద్దిపాటి మాటలతో వారూ బాగా గడుపుకు పోతున్నారు. ఎంత బాగా గడుపుకు పోతున్నారంటే, మొదటి బ్లాస్ట్ ఎయిర్ హీటర్ నిర్మాణాన్ని సోవియట్ వెల్డర్లు చేస్తే, రెండోదాని నిర్మాణంలో భారతీయులు సోవియట్ వెల్డర్లతోబాటుగా పనిచేశారు, మూడో దానిని నిర్మించేటప్పుడు భారతీయులు ఒక్కరే పనిచేస్తారు. సోవియట్ ప్రధాన వెల్డర్ భారతీయులకు బాగా కష్టపడి పనిచేసే శక్తివుందనీ, వారు విషయాలను చాలా తొందరగా గ్రహిస్తారనీ అన్నారు

ఇతర శాఖలన్నిట్లో కూడా యిదే విధంగా వుంది. ఉదాహరణకు, ఉక్కు స్ట్రక్చర్లను నెలకొల్పేపనిలో సోవియట్ ప్రవీణుడు శ్రీ గవ్రిష్‌తో మాటాడినప్పుడు, పెద్ద టవర్, గాంట్రీ క్రేన్లు నెలకొల్పడంలో ఎక్కువగా అనుభవంలేని భారతీయ క్రేన్‌మెన్ యిప్పుడు స్వతంత్రంగా వాటిని నెలకొల్పుతున్నారని తెలుసుకున్నాను. అక్కడ పనిచేస్తున్న క్రేన్లలోకల్లా ఎత్తయిన దానిఎత్తు 65 మీటర్లు, దాని బూము పైకి ఎత్తబడినప్పుడు అది 82 మీటర్లు వుంటుంది.

### సోవియట్ దేశంలో శిక్షణ

శిక్షణను గురించి, పరిశ్రమను నడపడానికి అవసరమయ్యే సిబ్బందిని గురించీ మాటాడుతూ భిలాయ్‌లోని సాంకేతిక శిక్షణ సూపరింటెంటు శ్రీ ముత్తుస్వామి, భిలాయ్ ఉక్కు పరిశ్రమను నడపడానికి అవసరమయ్యే సిబ్బందినిమిత్తం సోవియట్ ఇంజినీర్లు ఒక పథకాన్ని తయారుచేశారని నాకు చెప్పారు. మొత్తం ఏడువేలమంది సుశిక్షితులు దానికి కావాలి. ఈ తీవ్రసమస్య పట్టుదలతో పరిష్కరింపబడుతోంది. భారత దేశంలోని వివిధ స్థలాలలో శిక్షణకు ఏర్పాట్లను చేయడమే కాకుండా, సోవియట్ దేశానికి ఎక్కువగా భారతీయులు పంపబడుతున్నారు. శ్రీ ముత్తుస్వామి నాకు వివరించినదానిప్రకారం, రెండు ప్రభుత్వాల ఒప్పందం ప్రకారం, సీనియర్ ఉద్యోగులూ, ఇంజినీర్లూ, జూనియర్ సిబ్బంది, నిపుణ కార్మికులతోబాటుగా సుమారు 700 మంది భారతీయులు సోవియట్ దేశానికి శిక్షణకోసం వెళ్తారు. ఇప్పటికే చాలామంది

(మిగత 39వ పుటలో)

*



ఎలెక్ట్రికల్ ఎరెక్షన్ వర్క్సుకు సంబంధించిన అగ్ర సోవియట్ నిపుణుడు మిస్టర్ ఎం. ఈవ్‌స్తీన్ ప్రసంగిస్తోన్న దృశ్యం



పని బాగా సాగిపోతున్నది. అయినా సోవియట్ భారతీయ ఉన్నతాధికారులు నిర్మాణ స్థావరం దగ్గర ప్రతివిషయమూ పరిశీలన చేస్తున్నారు

కట్టడాలు త్వరత్వరగా లేస్తున్నాయి. తేనెపట్టులాగా వున్న ఇక్కడ ప్రతి విభాగంలోనూ చురుకుగా పని జరుగుతుండడం కనుపిస్తుంది




భిలాయ్‌లోని సోవియట్ ఉద్యోగుల నిత్య జీవితం గురించి, పని గురించీ వివరించమని చాలా మంది పాఠకులు మమ్మల్ని కోరుతున్నారు.

అక్కడి సోవియట్ పౌరుల వివిధ కార్యకలాపాలకు యీ పుటలలోని బొమ్మలు చిత్రిస్తాయి.

బ్రహ్మాండమైన కట్టడాలు లేస్తున్నాయి. అంతటా పడివున్న అపార వస్తుజాలం పనివేగం గురించీ, తీవ్రత గురించి తెలియజేస్తుంది.

ఈ పరిశ్రమ నిర్మాణంలో సుగ్రాహ్యమయ్యే ప్రత్యేక లక్షణం భారతీయ, సోవియట్ ఇంజినీర్ల సన్నిహిత సమ్మేళనమూ, సహకారమూ, స్నేహమున్నూ. ఇది యీ చిత్రాలలో సుస్పష్టంగా కనిపిస్తుంది.

పని అయ్యేక సోవియట్ ఉద్యోగులు, సరదాగా కాలక్షేపం చేస్తారు. జాతీయ దుస్తులలో జానపద నృత్యాలూ, సంగీత కచేరీలూ, ఫిల్మ్ ప్రదర్శనలూ, క్రీడలూ—యివ్వన్నీ వారి సాంఘిక జీవితంలో ఒక అంతర్భాగం. ఈ చిన్న బృందం తమతోబాటుగా, సోవియట్ దేశంలోని ఒక చిన్న ఖండాన్ని తీసుకవచ్చింది, ఉల్లాస వాతావరణం, యిష్టాగోష్టులూ, పిల్లల అమాయకపు చిరునవ్వులూ దీనినే తెలియజేస్తాయి.

ఛాయాచిత్ర యంత్రం దీనినంతట్నీ ఉన్నదున్నట్టుగా చిత్రించింది. మాటలకంటే యిదే బాగా మాటాడుతుంది.



ఉక్కు కర్మాగారం ఈ కట్టడాలతో నిర్మాణమవుతున్నది. రోజంతా, ఈ కట్టడాలను వాటి స్థావరాలకు చిన్న ద్వారాలగుండా క్రేన్లు చేరవేస్తుంటాయి



సోవియట్ డిజైనర్లు ఉస్పెన్‌స్కీ దంపతులు, నిర్మాణ స్థావరంపద్ద శ్రీ పాండ్యాతో నిర్మాణ సందర్భంగా చర్చ జరుపుతున్నారు →

దిగువన కుడినుండి ఎడమకున్న రెండవ చిత్రంలో, 65 మీటర్ల ఎత్తుగల క్రేను హాట్ బ్లాస్ట్ స్టవ్ యొక్క డోమ్‌ని, యథాస్థానంలో అమర్చుతున్న దృశ్యం కనిపిస్తుంది. ఈ పనిని నడిపించిన అరుణ కుమార్, నికొలాయ్‌నస్లికోవ్‌లు మర్నాటి కార్యక్రమాన్ని చర్చిస్తోన్న దృశ్యం

# బ్లాస్ట్ ఫర్నెస్ షాపు నిర్మాణము

ఈ మూడు చిత్రాలూ బ్లాస్ట్ ఫర్నెస్ షాపుయొక్క నిర్మాణదశలకు సంబంధించినవి

*



నిర్మాణ కార్యక్రమారంభం—ఏప్రిల్ 1957



మే, 1957



బ్లాస్ట్ ఫర్నెస్ కట్టడపు మొట్టమొదటి రేకును బిగింపు చేసినప్పటి ప్రారంభోత్సవ దృశ్యం—జూన్ 1957



నవంబర్ 22, 1957 టోపీ అమరిక చెయ్యని హాట్ బ్లాస్ట్‌స్టవ్



నవంబర్ 23, 1957. 20 టన్నుల బరువైన టోపీ అమర్చబడుతున్న దృశ్యం



బ్లాస్ట్ ఫర్నెస్ షాపుయొక్క దృశ్యం







నవ శిశూదయం సర్వత్రా సంతోషదాయకమే.
భిలాయ్‌లో పుటిన నలుగురిలోని ఒక బిడ్డ





ఆట కట్టించడానికి సిగరెట్
దమ్ము పనిచేస్తుందా ?



ఎక్కువ అభిమానపాత్రమైన
ఆట, బిలియర్డ్స్ !



డొమినోస్ ఆటగాళ్ళు, పత్రికా పాఠకుడు,
ప్రేక్షకులు





# నిర్మాతల మాటలు

మా విలేఖరులు, భిలాయ్ వద్ద పవర్ జనరేషన్ ప్లాన్టను నిర్మిస్తున్న హిందు



స్తాన్ కన్‌స్ట్రక్షన్ కంపెనీ లిమిటెడ్ ఇంజనీర్. శ్రీ కె. శ్రీనివాసన్, పవర్ జనరేషన్‌ప్లాన్ట్‌కు సంబంధించిన ప్రముఖ సోవియట్ నిపుణుడు మిస్టర్ తిమొఫెవ్‌ను వారి కృషిలో ఎటువంటి సహకారం వున్నదని అడిగారు.

దానికి వారిచ్చిన జబాబు ఇది :

శ్రీ కె. శ్రీనివాసన్ : ఒక్కొక్కప్పుడు మేము "కలహించు" కొంటాము. గాఢానురక్తి కలిగిన భర్త భార్యతో కలహించినట్టు. పరిశ్రమాగారపు నిర్మాణ కార్యక్రమాభివృద్ధి బాగున్నదనాలి, అందు వల్లనే మేము మంచి మిత్రులం కాగలిగాము.

మిస్టర్ తిమొఫెవ్ : భారతీయులతో కలసి పనిచెయ్యడం వాస్తవానికి ఒక సంతోషకరమైన విషయం. నిజమైన కార్మికమైత్రి, అతి సంక్లిష్టమైన యీ అధునాతన లోహ పరిశ్రమాగార నిర్మాణ కార్య నిర్వహణలో మా కందరికీ ఎంతో సహాయకారి అవుతున్నది.

మోల్దేవియాలోనిదృశ్యమా ఇది ? కాదు, ఈ సొగసుకత్తెల్సు ఆదేశపు నృత్యాన్ని భిలాయ్‌లో ప్రదర్శిస్తున్నారు

★



మనంకూడా చేద్దామా నృత్యం?

★



భారతీయ, సోవియట్ డాక్టర్లు ఇద్దరు అట్లా పదక ప్రక్కన వుంటే అట్లా ఉల్లాసంగా వుండక ఎట్లా వుంటుంది ఏరోగికయినా: కుడిప్రక్కన చీరకట్టుకొని వున్నది సోవియట్ డాక్టర్

# భారతదేశానికి సోవియట్ యంత్రాలు

స్వెర్డ్లొవ్‌స్క్‌లోని "స్ట్రోయ్ మషీనా" కర్మాగారం, లోహ పరిశ్రమ నిర్మాణానికి ఉపకరించు ఇటుకలు తయారుచేసే కొత్త యంత్రాన్ని పంపింది.

* * *

భిలాయ్ పరిశ్రమ కోసం ఉరల్స్‌లోని ఒక కర్మాగారం "1150" బ్లూమింగ్ మిల్లును నిర్మించింది. దీని యాంత్రిక పరికరాల బరువు 5 000 టన్నుల పైబడింది. ఈ బ్లూమింగ్ మిల్లు ఏటేటా లోహపు కడ్డీలు, వగైరా ఒకటిన్నర లక్షల టన్నులకు పైగా తయారు చేస్తుంది. తరువాత తరువాత ఈ ఉత్పత్తిని 2.5 మిలియన్ టన్నులవరకు పెంచగలుగుతుంది.

ఉరల్స్ మష్‌జావాద్ కర్మాగార కార్మికులు భారతీయ ఇనుము, ఉక్కు కార్మికులకు సంబంధించిన రెయిల్ అండ్ బీమ్ మిల్లు, నిర్విరామంగా పనిచేసే బిలెట్ మిల్లూ, రెండు పెద్ద ఆర్డర్లను పూర్తి గావించుటలో నిమగ్నమై ఉన్నారు.

* * *

రోస్తోవ్ మండలంలోని, ఎలక్ట్రిక్ రైలు ఇంజన్ల నిర్మాణం చేసే ఒక పరిశ్రమాగారపు కార్మికులు, భారత దేశపు ఒక ఆర్డరును పురస్కరించుకొని, యాంత్రిక అవసరాలకు వినియోగపడే ఒక 2-యాక్సిల్ ఎలక్ట్రిక్ రైలింజన్ను తయారు చేస్తున్నారు.

* * *

ఖార్కోవ్ యంత్ర నిర్మాణ పరిశ్రమాగారం భారత దేశంలోని పారిశ్రామిక సంస్థలకు, నిర్మాణ స్థావరాలకు పన్నెండు ఎలెక్ట్రిక్ వెల్డర్లను తయారు చేసింది.



# అఫనసీ పావ్‌లోవ్ కర్మాగారం

ఎన్. మార్

సోవియట్ దేశంలోని అనేక పరిశ్రమాగారాలలో, భిలాయ్ పరిశ్రమాగారానికి వివిధాలైన యంత్రపరికరాలు త్వరితగతిన ఉత్పత్తి అవుతున్నాయి.

భారతీయ ఉక్కు పరిశ్రమాగారానికి క్రేన్లను తయారుచేస్తున్న మాస్కోలోని పాద్యోమ్నిక్ కర్మాగారాన్ని మా విలేఖరి సందర్శించారు. అక్కడ తాను చూచిన దానిని, కార్మికులు ఎంత ఉత్సాహంతో భారత దేశపు ఆర్డరును పూర్తి చేస్తున్నదీ ఆయన యీ వ్యాసంలో వర్ణించారు.

సోవియట్ పరిపాలనలో పారిశ్రామిక ప్రాంతంగా మారిన మాస్కోలోని పూర్వపు కర్మాగారాల వాడలో నేను, అనుకోకుండానే "భారత దేశపు ఒక స్వల్ప భాగాన్ని" ఎట్లా కనిపెట్టగలిగానో మీకు ఇందులో చెప్ప దలచుకున్నాను.

పొద్యోమ్నిక్ పరిశ్రమాగారం వద్ద ఇది జరిగింది. ఈ పరిశ్రమాగారం, అగ్రస్థానాన్ని పొందిన పెద్ద ఫ్యాక్టరీలేగాక, నిర్మాణాలేగాని, ఒక చిన్న అపార్ట్‌మెన్ట్ గృహమేగాని మన కాలంలో ఉపయోగించక తప్పని పరికరాలను, పెద్ద పెద్ద క్రేనులను, ఎక్స్‌ప్రెస్ లిఫ్టులను, గృహోపకరణాలను తయారుచేస్తున్నది.

పత్రికా సంబంధ కార్యక్రమంమీద ఈ పొద్యోమ్నిక్ కర్మాగారానికి వచ్చి, క్రేన్‌షాపులోని పెద్దపెద్ద యాంత్రికపు అమరికలను చూస్తుండగా, "భారత దేశం" అని వ్రాసివున్న ఒక సైన్‌బోర్డు కనుపించింది.

"ఈ సంకేత సూచికకు అర్థం యేమిటి?" అని నేను, పరిశ్రమాగారంలో ముప్పై సంవత్సరాలనుంచీ పనిచేస్తున్న కార్మికులలో ప్రముఖుడైన నా సహచరుడు, ఫోర్మన్ కాన్‌స్టాన్‌టిన్ షత్‌స్కోవ్‌ను ప్రశ్నించాను.

"సులభంగా అర్థంచేసుకోవచ్చు! షాపులోని ఈ విభాగంలో భారతదేశపు ఆర్డరు పూర్తి చేయబడుతున్నది.

ఈ ఆర్డరును పురస్కరించుకొని పూర్తి కావలసిన పని, ఇతర విభాగాలనుంచి ఈ విభాగానికి మార్చబడింది. స్పష్టంగా తెలియడానికి గాను, బహుశా ఈ సైన్‌బోర్డు తగిలించాలన్న మంచి ఊహ ఎవరికో తట్టివుంటుంది.

"మరో మాట, భారత దేశానికి సంబంధించిన విషయాలలో నాకన్నా మీకు, అఫనసీ పావ్‌లోవ్ ఎంతో సహాయకారి కాగలుగుతాడు. ఆయన భారత దేశానికి ఇంతవరకూ వెళ్ళని మాట నిజమే, అయినా ఈ పరిశ్రమాగారంలో అందరికన్నా భారత దేశాన్ని గురించి బాగా తెలిసినవాడు ఆయనే."

నేను ఆయన సలహాను పాటించాను. ఎలక్ట్రిక్ వెల్డర్లు పనిచేస్తున్నచోట, బలమైన భుజాలు, పొడుచుకొచ్చే నెరసిన జుట్టూ, మిరుమిట్లు గొల్పేట్టు చిరునవ్వుతోన్న నిండైన మనిషిని, అఫనసీ పావ్‌లోవ్‌ను చూచాను. అక్కడ అప్పుడప్పుడు దట్టంగా విద్యుత్ కాంతులు ప్రసరిస్తున్నాయి. అక్కడ ఏ విషయాన్నైనా

వివరించాలంటే, న్యూమెటిక్ సుత్తెల, వెల్డింగ్ యంత్రాలధ్వానాల మధ్య చేతులతో సౌంజ్ఞల ద్వారా చెప్పాంల్సిందే. "ఒక నిముషం" అన్నట్టు పావ్‌లోవ్ సౌంజ్ఞ చేశాడు. సరిగ్గా నిముషం కాగానే మేము చిన్న గొయ్యిలాగా వున్న ఒక చోటికి చేరుకున్నాము. అది పావ్‌లోవ్ కార్యాలయపు గదిలా ఉపయోగపడుతున్నది, నేను ఊహించలేదుగాని, అక్కడ ఎంతో ప్రశాంతంగా ఉన్నది.

"అయితే మీకు, మా భారతీయ విషయాలలో అభిరుచి వుందన్నమాట?" అన్నాడు పావ్‌లోవ్. "మేమంతా-అదే పనిమీదవున్నాం, ఎందుకంటే చెయ్యవలసిన పని తరగకుండా వున్నది. మూడురోజులలో భిలాయ్‌కి మూడు క్రేన్లు పంపించాలి."

అనేక సంవత్సరాలుగా పత్రికా విలేఖరిగా పనిచేస్తూన్న నేను, నా అలవాటు ప్రకారం పావ్‌లోవ్‌ను మొట్టమొదట అతన్ని గురించి నాలుగు ముక్కలు చెప్పమన్నాను. దీనివల్ల అతను పూర్వం ఫిట్టర్ అని తెలుసుకోగలిగాను. ఒక మాధ్యమిక సాంకేతిక పాఠశాలలో చదువుతుండగా. హఠాత్తుగా భార్య మరణించడంవల్ల, తన పిల్లలిద్దరి పోషణకోసం తాత్కాలికంగా చదువు విరమించుకోవలసి వచ్చిందట. పిమ్మట పారిశ్రామిక విద్యా పరిషత్తులో చేరి పట్టభద్రుడైన తర్వాత. షాపులో మేనెటీరియల్ పదవి ఇవ్వబడిందట.



క్రేను కూర్పు

తనను గురించి దీర్ఘంగా మాట్లాడడానికి ఇష్టంలేక ఆ నాలుగు ముక్కలే చెప్పి, ఆ తర్వాత పావ్‌లోవ్ భారత దేశపు ఆర్డర్‌ను గురించి మేము సంభాషిస్తున్న అంశానికి వచ్చాడు.

దాదాపు ఒకటిన్నర, రెండు సంవత్సరాల క్రితం పొద్యొమ్నిక్ పరిశ్రమాగారానికి, అప్పటిలో భిలాయ్‌లో నిర్మితం కానున్న పరిశ్రమాగారానికిగాను వివిధ రకాల మూవింగ్ క్రేన్సు బ్లాస్ట్‌ఫర్నెస్‌లు, వోపెణ్ హార్త్ ఫర్నెస్, కోక్ కెమికల్ షాపులు, కాణ్సెణ్ట్రేషణ్ మిల్లు,

★



బ్లాక్‌స్మిత్ వాసిలీ పవ్‌లుకోవ్ భిలాయ్‌కి పంపబడనున్న క్రేనుకు చివరి వన్నెలు దిద్దుతున్న దృశ్యం

ఉప విభాగములకు ఆర్డర్ ఇవ్వబడినది. సోవియట్ ప్రభుత్వం పొద్యొమ్నిక్‌కు ఇంతకుమునుపే కొత్త సామగ్రిని అమర్చడంవల్ల ఈ పరిశ్రమాగారం, మాగ్నిటొ గార్స్క్‌లో కొత్త ఇనుము, ఉక్కు కర్మాగారాలకు కుజెనెట్స్క్, స్టాలినో, రుస్తవ్ మొదలైన సోవియట్ దేశంలోని ఇతర నగరాలకు బలిష్టమైన క్రేనులను సమకూర్చగలిగినది. కాగా పోలెండ్, ఛెకొస్లొవేకియా, ఫిన్లండ్, రుమేనియా, బల్గేరియా మొదలైన దేశాల ఫ్యాక్టరీలకు క్రేనులను సరఫరా చేసింది. భారత దేశపు ఆర్డరు సంబంధంగా, ఒక్క ఆ దేశపు శీతోష్ణస్థితి విషయంలో తప్పితే, మరి ఇతరత్రా ఏ విధమైన సాంకేతిక ప్రతిబంధకాలు ఏర్పడలేదు.

"మా క్రేనులు ఉష్ణ ప్రదేశాలలో పని చెయ్యడానికి ఇదే మొదలు," అన్నారు పావ్‌లోవ్. "ఫాక్టరీ డిసైనర్లు, ఇంజనీర్లు ప్రపంచపు అన్ని ప్రాంతాల సాంకేతిక సారస్వతాన్ని సంశోధించి, ఉష్ణ ప్రదేశాల యాంత్రికావశ్యకతల సమగ్రాన్వేషణకు ఉపక్రమించారు. బ్రిటిష్, అమెరికణ్, ఫ్రెంచి సంస్థలు, భారత దేశానికి విక్రయంచేసిన యాంత్రిక వస్తువులు స్థానిక శీతోష్ణ స్థితులకు తట్టుకోలేక, తరచు పగిలిపోతుండేవని మేము తెలుసుకొన్నాము. అందువల్ల మా యాంత్రిక వస్తువులకు అటువంటి విభిన్న పరిస్థితులేర్పడవని స్పష్టపరచుకోదలచుకున్నాము. మా ట్రేడ్‌మార్క్ యొక్క, మా కర్మాగారం యొక్క గౌరవ ప్రతిష్టలు మాకు అత్యంత ప్రియతమమైనవి. అంతేకాదు, భిలాయ్ పరిశ్రమాగారం బహుకాలం, మా స్నేహితులు. సహచరులైన భారత ప్రజల అభ్యున్నతికై బాగా పని చెయ్యగలగాలని ఆకాంక్షిస్తున్నాము.

మా డిసైనర్లు, కార్మికుల సలహాలను, సూచనలను పురస్కరించుకొని క్రేనులలో అతి విలువైన కొత్త అంశాలను, క్రేనుల నిర్మాణ ప్రపంచానికే వినూత్నమైనవాటిని అనేకం ప్రవేశపెట్టారు. ఈ నూతన విషయాలను మా కర్మాగారంలో తెలుసుకొన్న విదేశ నిపుణులు వీటిని ఎంతో ప్రశంసించారు. ఇదంతా మేము చేస్తున్నది ప్రశంసలకోసం కానేకాదు, ఇదంతా భారత దేశంకోసం, మా మిత్రులకోసం, మరో మాటలలో మాకోసం మేము పనిచేస్తున్నామన్న మా హృదయాలలోని ప్రగాఢ ప్రేరణతో చేస్తున్నదే. ఏమైనప్పటికీ, ప్రాచ్య ఖండపు సామెతలో చెప్పినట్టు, నీవు స్నేహితుడివిగా వుండదలచుకున్నట్టయితే, వీలయినంత తక్కువగా దానిని గురించి మాట్లాడడం మంచిది."

కర్మాగారపు అసిస్టెంట్ చీఫ్ ఇంజనీర్, నికొలాయ్ కమ్నెవ్ సహాయంతో నేను, భారతీయ విభాగ జీవితంగురించి తెలుసుకుంటున్నాను.

సముద్రయానానికి పోనున్న పెద్ద పెద్ద నౌకలు నిర్మితమవుతున్న ప్రాంతంలాగా డ్రైడాక్‌లవలె కనుపించింది. భిలాయ్ పరిశ్ర

మాగారంలో పోత ఇనుము కరిగించి ఉక్కును తీసి, దానితో లోహపు రేకులను, కడ్డీలను మొదలైనవాటిని తయారుచేసే కర్తవ్యాన్ని బ్లాస్టుఫర్నేసులకు అప్పగించనున్న క్రేనుల మల్టీంటన్ను ఫ్రేములు వరుసలు తీరి, రేవు దొరువుల పొడవునా, ఎలక్ట్రిక్ వెల్డింగ్ చేస్తున్నప్పుడు ఆ వినీలకాంతులలో తుప్పపడి వున్నాయి. క్రేనుకు ఇదే జన్మస్థానం. లోహపు తుండ్లన్నింటినీ ఇక్కడికి తెచ్చి, వాటికి గుర్తులు వేసి; ఇతర షాపులనుంచి వచ్చే ప్రప్రధానమైన గర్డర్లనూ, పెట్టెలనూ, చక్రాలనూ, క్రేనుట్రాలీలనూ అన్నింటినీ చేర్చి ఇక్కడ క్రేనులను అమర్చుతారు.

"పొద్యోమ్నిక్ యంత్రాగారం, దాదాపు ఆసియాలో సగానికి క్రేన్లనూ, లిఫ్టులనూ సరఫరా చెయ్యడం మీరిక్కడ చూస్తున్నారు" అన్నారు నికొలాయ్ కమ్నెవ్. భారత దేశానికి క్రేన్లను తయారు చేయడమన్నది నవీన పరిశోధనలకు దారితీసి నూతన భావాలకు రెక్కలు కట్టింది. అనేక జటిల సమస్యలు ఈ యంత్రాగారంవద్ద, ఈ మాస్కో గడ్డమీద పరిష్కరించవలసి వచ్చింది. నడపటానికి అనువైన, దృఢమైన, శక్తివంతమైన క్రేనును త్వరగా తయారుచెయ్యవచ్చునుగానీ, తరుగుదల కారణంగా వేడి పరిస్థితులవల్ల లోహం త్వరగా హరించుకపొయ్యే ప్రమాదం వున్నది. అందుచేత భిలాయ్‌లో వేడి పరిస్థితుల మీద మాస్కో యంత్రాగారం యుద్ధం ప్రకటించవలసి వచ్చింది. లోహానికి దీర్ఘాయుష్షను కల్పించగలిగే సాధనలను, ప్రక్రియలను కనిపెట్టవలసి వచ్చింది. ఈ సాధన క్రేను యొక్క లోహానికి శాండ్ బ్లాస్ట్ కొట్టడంతో ప్రారంభ మవుతుంది. దీనివల్ల లోహానికి దార్ఢ్యత ఏర్పడుతుంది. ఈ ప్రక్రియ క్రేను ఉపరిభాగాలకు పావ్‌లోవ్ కర్మాగారంలో వేయవలసిన అయిదారు పూతల రంగును తయారుచెయ్యడంతో పూర్తవుతుంది. క్రేనులు దీర్ఘకాలం మనేటట్టు, ఉన్నత స్థాయిన నికరంగా పనిచెయ్యగలిగేటట్టు ముందుగానే జాగ్రత్త తీసుకోవడానికి యంత్రాగారం దగ్గర అనుల్లంఘ్యమైన పర్యవేక్షక వ్యవస్థ ఏర్పాటు చేయబడినది.

"యంత్రాగారపు పరిశోధనాలయంలో సంశ్లేషణ చేయకుండా ఏ వస్తువునూ మేము తీసుకోము, ఏ పరిస్థితులలోను దానిని అంగీకరించము. లోహం, మోటార్ - వైన్డింగ్, కాబిన్‌కు అమర్చే అద్దం, వైర్లూ—ముక్తసరిగా చెప్పాలంటే ప్రతిదీ, నికరంగా ముందుగానే పరీక్షించబడుతుంది." అన్నాడు పావ్‌లోవ్. "దేన్నీ తీసిపారెయ్యడానికి, పర్యవేక్షక విభాగానికి అందుచేతనే ఒక్కమాటు కూడా అవకాశం చిక్కలేదు. ఈ విషయంలో మేము ఎంతో నిక్కచ్చిగా వుంటాము. ప్రపంచ మార్కెట్టులో మా సరుకులు—పారిస్‌లో, ఢిల్లీలో, షాంఘైలో పేరుకెక్కాయి. మా సరుకులో ఇప్పటికి ఏ ఒక్కటీ తిరుగగొట్టబడలేదు. కాగా అటువంటి సంఘటన జరనిదని మా నమ్మకం. ఎంతో గట్టి సంస్థ ఇది...."

....ఈ అఫనసీ పావ్‌లోవ్ "కర్మాగారం" గురించీ, పొద్యోమ్నిక్ కర్మాగారంలో గమాస్కో కార్మికుడూ, ఆయన సహచరులూ, భిలాయ్‌లో తమ క్రేనుల పనికి సంబంధించిన ప్రప్రధమ నివేదికలను వినడానికి ఆతురతతో నిరీక్షిస్తున్నదానిని గురించీ; యంత్రాల ఆధునీకరణ సమస్య సాంకేతిక సమావేశాల ద్వారా వారందరూ ఎట్లా పరిష్కరించిందీ, మనస్ఫూర్తిగా వారు చేసే ప్రతీదీ, వడ్రంగులు క్రేన్లను పెద్ద పెద్ద క్రేట్లలో మాస్కోనుంచి సదూర భారత దేశానికి పంపడానికి బిగింపు చెయ్యడాన్ని గురించీ ఎంతైనా చెప్పుకపోగలను.

....నేను షాపు విడిచిపెట్టబోతుండగా భారత విభాగమంతా కాంతులతో మెరిసిపోతూ వుంది. వెల్డింగ్ పని త్వరితగతిన సాగిపోతున్నది. ఈ మధ్యన ఒక రైలింజన్, కొండల బారువలె పెద్ద పెద్ద క్రేట్లున్న ప్లాట్‌ఫారాలను లాక్కొని పోతున్నది. వాటిమీద రష్యన్‌లోను ఇంగ్లీషులోను "భిలాయ్, భారత దేశం. సరుకులు భద్రం." అని వ్రాసి వున్నది.

## నిర్మాతల మాటలు

శ్రీ ఎం. వి. ఆర్. అయ్యర్,
డివిజనల్ ఇంజనీర్ (స్ట్రక్చరల్), బ్లాస్ట్ ఫర్నెస్ ప్లాంట్

"భిలాయ్ ఉక్కు పరిశ్రమాగార నిర్మాణంలో నేను పనిచెయ్య నారంభించి, ఇప్పటికే ఒక ఏడాది దాటింది. పని చాలా సంతృప్తికరంగా వున్నది. ఒకొక్కప్పుడు ఈ నిర్మాణపు బ్లాకులతో మేము పిల్లలాగా ఆడుకుంటున్నట్టనిపిస్తుంది; నిర్మాణానికి పెద్దపెద్ద ఖండాలు సోవియట్ దేశం నుంచి వస్తున్నాయి. వాటిని అమర్చి, అక్కడే సరిచూస్తారు. ఇక్కడ మేము చెయ్యవలసినల్లా వాటిని ఒకచోట కూర్చడమే."



# భారతీయ పత్రికాభిప్రాయాలు

గత నెల భారతీయ పత్రికా రచయితల బృంద మొకటి, ప్రభుత్వ పారిశ్రామిక రంగంలోని వైన దుర్గపూర్, రూర్కేలా, భిలాయ్ ఉక్కు పరిశ్రమలకు వెళ్ళి చూసింది.

వారు భిలాయ్ గురించి అనుకున్నదీ, వ్రాసినదీ ఏమిటో తెలుసుకోవడం మా పాఠకులకు కుతూహలజనకంగా వుంటుంది. వివిధ భారతీయ వార్తా పత్రికలలో వెలువడిన వారి రచనల నుండి కొద్ది భాగాలను యీ దిగువ ప్రచురిస్తున్నాము.

శ్రీ జి.యన్.యస్.రాఘవన్. "ఇండియన్ ఎక్స్‌ప్రెస్", ఢిల్లీ, నవంబరు 13

మూడు కొత్త ఉక్కు పరిశ్రమల కొరకు విదేశాలతో జరుపబడిన సంప్రదింపులబట్టి చూసినట్లయితే, రూర్కెలా మొట్టమొదట, తరువాత భిలాయ్, ఆఖరున దుర్గాపూర్ తయారు కావలసి వుంది. కాని ఈ మూడు నిర్మాణ స్థలాలను చూసినట్టయితే, భిలాయ్ పరిశ్రమ అన్నిటికంటె ముందుగా తయారయ్యేటట్టుగా కనిపిస్తోంది....

పి. టి. ఐ. ప్రత్యేక విలేఖరి, "హిందూస్తాన్ స్టాండర్డ్", కలకత్తా, నవంబరు 12

ఒక పెద్ద భారతీయ అధికారి ఇలా అన్నారు: "శిక్షితులు పనిచేసిన (సోవియట్ దేశంలో) ఉక్కు మిల్లు డైరెక్టరు అయిన అందరికంటె పెద్ద సోవియట్ అధికారికి, వారికి శిక్షణనిచ్చే బాధ్యత అప్పగించబడింది. ఉక్కు నిర్మాణం గురించి మన కుర్రవాళ్ళు తమకు యిష్టంవచ్చిన ప్రశ్నలను అడగవచ్చును. వారికి పూర్తి జబాబులు యివ్వబడ్డాయి. వారికి తెలియకుండా ఏదీ దాచివెయ్యబడలేదు. తమ పరిమిత రష్యన్ భాషా జ్ఞానంతో మన భారతీయ విద్యార్థులు గ్రహించలేని కొన్ని విషయాలను వివరించడానికి, సోవియట్ దుబాసులు వందలకొలది మైళ్ళ దూరంనుండి విమానంపైని తీసుకరాబడిన దృష్టాంతాలు కూడా ఉన్నాయి....."

"హిందుస్తాన్ స్టాండర్డ్", ఢిల్లీ, ప్రత్యేక విలేఖరి, నవంబర్ 12

గత వారం భిలాయ్‌కు, అప్పుడే రష్యానుండి వచ్చిన యంత్రాలవేపు చూపుతూ ఒక పెద్ద ప్రాజెక్టు అధికారి, సామాన్యమైన ఇనుప ఊచలు కూడా "బంగారంలాగా ప్యాకుచేయబడ్డాయి" అని అన్నారు. సోవియట్ దేశంనుండి భారతదేశానికి చేసిన దూరప్రయాణంలో కూడా నూటికి ఒక అరవంతయినా విరగని రిఫ్రాక్టరీల కుప్పను ఆయన మాకు చూపెట్టారు.

....పాత వద్ధతిలో, భిలాయ్ ఉక్కు పరిశ్రమ, ప్రపంచంలో అత్యుత్తమంగా డిజైన్ చేయబడిన పరిశ్రమలలో ఒకటిగా వుంటుందని చెప్పబడుతుంది. నాకు బాగా కనిపించిన విషయమేమిటంటే, క్రమబద్ధమైన ప్లానింగు, పరిశ్రమ యిమిడిక. బ్లాస్ట్ ఫర్నేసులు ఒక దానికొకటి చేరువగా వరసలో ఏర్పరుపబడ్డాయి. ఇది వాటికీ ఉక్కును కరిగించే కార్ఖానాలకూ మధ్య ఎక్కువ దూరం కలిపే లైన్ల ఖర్చు లేకుండా చేసి, స్ట్రక్చరల్ ఖర్చులనూ, యితర ఖర్చులనూ లేకుండా చేస్తుంది.

పి. టి. ఐ. ప్రత్యేక విలేఖరి, "ట్రిబ్యూన్", అంబాలా, నవంబరు 13

రెండవ పంచవర్ష ప్రణాలికా కాలంలో పూర్తి కానున్న, ప్రభుత్వ పారిశ్రామిక రంగంలోని మూడు పది లక్షలటన్నుల ఉక్కు నిర్మాణ ప్రాజెక్టులలో ఒకటి, భిలాయ్. రూర్కెలాలోనూ, దుర్గపూర్ లోనూ జరిగే రెండు ప్రాజెక్టులలో ముఖ్యంగా పునాదులు వెయ్యడమూ, కాంక్రీటు పొయ్యడమూ సాగుతూ వుంటే, *జర్మనీనుండీ,* బ్రిటన్‌నుండీ స్ట్రక్చర్సు కోసం వేచివుంటున్నారు. కాని భిలాయ్‌లో యిప్పటికే ఒక బ్లాస్ట్ ఫర్నేస్ నేలకు 60 అడుగుల ఎత్తున లేచింది.

భిలాయ్‌లో పరిపాలనా భాగాన్ని చూస్తోన్న ఒక పెద్ద భారతీయ అధికారి, పి. టి. ఐ. విలేఖరికి యిలా చెప్పారు। "మా కొక కార్య ప్రణాలిక యివ్వబడింది. ఇది రెండు ప్రభుత్వాలకు మధ్యను జరిగిన ఒక ఒడంబడిక. అందుచేత, యిది ఒక కంపెనీకిగాని, కొన్ని కంపెనీలకుగాని సంబంధించిన విషయం కాదు—రెండు ప్రభుత్వాల ప్రతిష్ఠకు సంబంధించిన విషయం యిది."

ప్రత్యేక విలేఖరి, హిందూస్తాన్ టైమ్స్", న్యూఢిల్లీ, నవంబరు 13

....మొదటి బ్లాస్ట్ ఫర్నేస్ పని బాగా ముందుకుపోయి, దాని స్టవ్స్‌లో ఒకటి యిప్పటికే నెలకొల్పబడి, యింకొకటి నెలకొల్పబడుతూ వున్నప్పటికీ, భిలాయ్ పనిలోని విస్పష్టమైన హంశం ఏమిటంటే—మొదటి దశకు అవసరమైన యూనిట్లన్నీ యించుమించుగా ఒకేసారిగా నిర్మాణం అవుతున్నాయి. ఇంకో హంశం, స్ట్రక్చర్లలో అధిక భాగం రివెటింగుగాక, వెల్డింగు చేయబడుతున్నది. దీనికి విరుద్ధంగా, నాకు రూర్కెలాలో, కోక్ ఓవెన్ బేటరీ పని సాగిందిగాని, యితర యూనిట్ల పని చాలా వెనుకను ఉండిపోయింది.....

బి. జి. వర్గీస్, "టైమ్స్ ఆఫ్ ఇండియా", ఢిల్లీ, నవంబరు 12

....భారతీయ, సోవియట్ ప్రధాన ఇంజినీర్లతో సంప్రదించి నిర్మాణ కార్య ప్రణాలిక తయారుచేయబడింది; పని పురోగమనాన్ని నడపడానికీ, పర్యవేక్షించడానికీ ఒకొక్క యూనిట్టు నిర్మాణంలో సోవియట్ ప్రవీణులు, భారతీయ ఇంజినీర్లతో కలిసి పాటుపడుతున్నారు. ఈ సన్నిహిత సమ్మేళనం భిలాయ్‌లో మనస్సుకు హత్తుకపోయే విషయం; బహుశా యిది సాధింపబడిన ప్రగతికి ఒక కారణమై వుండవచ్చును...

---

భిలాయ్, రూర్కేలా, దుర్గపూర్ సంచిక యస్. యల్. జయస్వాల్, ఆగస్టు 15, 1957

....భిలాయ్ ఉక్కు పరిశ్రమ భారతదేశ పారిశ్రామిక ప్రగతికీ, మధ్య ప్రదేశ్ సౌభాగ్యానికీ ఒక గొప్ప ముందడుగు....

....భిలాయ్ ఉక్కు ప్రాజెక్టు మధ్యప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధికీ, ఆర్థిక సౌభాగ్యానికీ గొప్ప అవకాశాలను చేకూర్చుతుంది. కొద్ది యేళ్ళలో యీ ప్రాంతం వ్యాపార, పారిశ్రామిక కార్యకలాపాలతో ఎంతో సందడిగా వుంటుంది; అంటే ప్రజల ఆర్థిక సంక్షేమం అన్న మాట. ఈ పరిశ్రమ ఏభై వేలమందికి పనినిస్తుందని భావింపబడుతోంది. మన బొగ్గు, మాంగనీస్ పరిశ్రమలకు యిది ప్రోత్సాహాన్నిస్తుంది. చాలా తక్కువ కాలంలో, యీ వ్యవసాయ ప్రాంతమైన ఛత్తీస్‌గఢ్ గొప్ప పారిశ్రామిక ప్రాంతంగా మారిపోతుంది.

## భారతదేశ పారిశ్రామికీకరణలో భిలాయ్ ఉక్కు పరిశ్రమ నిర్వహించనున్న మహత్తర పాత్ర

(12వ పుట తరువాయి)

ప్రశ్న: భారతీయుల, రష్యన్ల మధ్యన ఇక్కడ పెంపొందుతున్న సహకారం మమ్మల్ని ఎంతో ఆకర్షించింది. వీరి మధ్యన జీవితం గడుపుతున్న మీరు, దీనికీ, కార్యసాధనంట్లు ఇక్కడ కనిపించే శ్రద్ధాసక్తులకు, ఉత్సాహానికి హేతువేమిటంటారు?

జవాబు. మొదటి మాట, ఇదంతా దేశాభిమానంతో చేస్తున్న కృషి. నవ నిర్మాణానికి ఉపక్రమించి నూతన భారతాన్ని సృష్టించాలనే ఒక విశిష్ట ప్రేరణ. భిలాయ్‌లో భారతీయులు నిర్మిస్తున్నది ఇంతకుపూర్వం నిర్మితం కాలేదు. క్రొత్తదారి తీస్తున్నామన్న ఆవేశం అందరి మనస్సులలోనూ నాటుకొని వున్నది. సోవియట్ ఇంజనీర్ల సహాయంతో ఇక్కడ వారు నేర్చుకొన్నది, ముందుముందు అనేక యంత్రాగారాలు నిర్మించడానికి ఉపకరిస్తుంది. తమ విజ్ఞానాన్ని పంచిపెట్టడానికి ఎంతో ఆతురత కలిగిన సోవియట్ ప్రజలిచ్చే సమగ్ర సలహా సహాయ సంపత్తులు ఈ కృషికి మరింత దోహదమిస్తున్నాయి.

ప్రశ్న: ఈ మైత్రిని విశదీకరించే కొన్ని ఉదాహరణలిస్తారా?

జవాబు: నిర్మాణ స్థావరంలో సర్వత్రా కనిపిస్తోన్న స్నేహ వాతావరణాన్ని మీరు తప్పక చూచి తీరుతారు. రష్యన్ల సహకారం లేనట్లయితే ఇంత సులభంగా పని జరగడం దుర్లభం. సోవియట్ దేశంనుంచి తిరిగివచ్చిన పట్టభద్రులైన భారతీయ ఇంజినీర్లను మీరు కలిసేవుంటారనుకుంటాను. సోవియట్ ప్రజల స్నేహ, ఔదార్యాలు వారికెంతో సంతృప్తి నిచ్చాయి. స్వస్థానంలో ఉన్నట్టుగానే రష్యన్లు వారికి చక్కటి వాతావరణాన్ని కల్పించారు. వారు, ఇక్కడ సద్వినియోగం కాగల విద్యా విజ్ఞానాలను సముపార్జించుకొన్నారు.

ఈ ధూళి ధూసరితమై వున్న ఈ ఉష్ణప్రదేశం సోవియట్ నిపుణులకు ఉత్సాహంగా పని చెయ్యను అంత అనువైనది కాదు. తమ దేశంలో వున్నట్టు, ఇది వారికంత సుఖప్రదంగా వుండదు. అయినా మా స్నేహ సౌజన్యాలవల్ల వారికున్న అసౌకర్యాలను వీలయినంతవరకు తొలగించడానికి ప్రయత్నిస్తాము.

---

## సృజనాత్మక కృషిలో సుస్నేహం

(11వ పుట తరువాయి)

భిలాయ్ ఉక్కు పరిశ్రమ డిజైన్‌లో సోవియట్ అనుభవం పొందుపరచబడింది భిలాయ్‌లో సోవియట్ ప్రవీణులతో నిత్యం సహకరించి పనిచేయడంతో, భారతీయ ఇంజినీర్లు దీనిని నేర్చుకుంటున్నారు. సోవియట్ దేశంలోని పరిశ్రమలలో శిక్షణను పొందుతూ వున్నప్పుడు, చాలామంది భారతీయ ఇంజినీర్లు యీ అనుభవ లాభాన్నిపొందుతూ వున్నారు.

విభిన్న భాషలకు చెందిన ప్రజలు సమాన శత్రువుతో పోరాడడమూ, తమ మాతృభూమి గౌరవ రక్షణ కొరకు, స్వాతంత్ర్య రక్షణ కొరకు ఒక్కటైన సందర్భాలలో వారి స్నేహం పెంపొందడమూ చరిత్రలో కనిపిస్తుంది.

కాని ప్రజల సృజనాత్మక కృషివల్ల ఇంకా దృఢతరమైన మైత్రి, సౌభ్రాతృత్వం సంఘటితమయ్యాయి. దీని గురించి అనుమానం వున్నవారు భిలాయ్ ఇనుము ఉక్కు పరిశ్రమ నిర్మాణ స్థలంవద్ద యిప్పుడు సాగుతున్న పనిని ఒక్క రోజైనా చూస్తే చాలు.

"జలకేంద్ర" తండేలు ప్రభాత్ లల్లా (ఎడమ), ఒడెస్సా రేవు ఓడ కాసీ హైదార్ కిరిచెంకో



## నిర్మాతల మాటలు



శ్రీ పి. సి. షామ్,
మేనేజర్, హిందుస్తాన్ కన్‌స్ట్రక్షన్ కంపెనీ లిమిటెడ్, భిలాయ్ శాఖ

"సోవియట్ ఇంజనీర్లతో మా సహకారం నా కెంతో సంతోషాన్ని కలిగిస్తున్నది. ఎంతో శుభప్రదంగా ప్రారంభమైన యీ సహకారం, ఇదే మాదిరి ముమ్ముందు ఇంకా అభివృద్ధి చెందగలదని ఆశిస్తున్నాను."



శ్రీ బండారే,
కౌశాల్ కన్‌స్ట్రక్షన్ కంపెనీ ప్రధానభాగస్వామి

"నేను పనిచేస్తున్న మొట్టమొదటి భారీ నిర్మాణం. ఈ భిలాయ్ ఉక్కు పరిశ్రమాగారం. ఇది పూర్తిఅయిన తర్వాత కూడా రష్యన్లతోకలసి మరోసారి పనిచెయ్యాలని నేను ఎంతో ఉత్సాహిస్తున్నాను. ఎందువల్లనంటే పనివిషయంలో వారు ఎంతోసరసులు, ఉపయోగకరమైందని నేను భావించి సలహా యిచ్చినప్పుడల్లా వారు దానిని అంగీకరించారు."



సంయుక్త భారతీయ-సోవియట్ చలన చిత్రం "పరదేశి"లో ఒలెగ్ స్త్రిజెనోవ్ (రష్యా యాత్రికుడు, అఫనసీ నికితిన్ పాత్రధారి)
బల్‌రాజ్ సాహనీ (భారతీయ గాయకుడు సఖారామ్ పాత్రధారి)

"పరదేశి" లోని గంభీర దృశ్యాలు





సంయుక్త భారత-సోవియట్ చలనచిత్రం "పరదేశి" లోది. 15వ శతాబ్దంలో భారత దేశాన్ని పర్యటించిన ప్రముఖ రష్యన్ పర్యాటకుడు అఫనసీ నికితిన్ సాహస యాత్రను చిత్రిస్తున్నది.

# ఘనతర దౌత్యము

మా విలేఖరి

*భారత దేశానికి సోవియట్ దేశ అసాధారణ, సర్వాధికారయుత నూతన రాయబారి శ్రీ పి. కె. పొనమరెంకో, తన పదవిని స్వీకరించేందుకు డిసెంబరు 10వ తేదీని ఢిల్లీకి వచ్చారు. ఆయన మాస్కో నుండి బయలుదేరడానికి ముందర, మా మాస్కో విలేఖరి ఆయనతో యింటర్వ్యూ చేశారు.*

*—సంపాదకుడు.*

★ ● ★



శ్రీ పి. కె. పొనొమరెంకో, భారత దేశానికి సోవియట్ దేశ అసాధారణ సర్వాధికారయుత రాయబారి

భారత దేశానికి సోవియట్ దేశ అసాధారణ సర్వాధికారయుత నూతన రాయబారి పంతెలైమొన్ కోంద్రత్యేవిచ్ పొనొమరెంకోతో యింటర్వ్యూ చేసే అవకాశం నాకు కలిగినప్పుడు, నేను మొట్టమొదట మాస్కోలోని పెద్ద పుస్తకనిలయమైన ప్రభుత్వ లెనిన్ గ్రంధాలయానికి వెళ్ళాను. అక్కడ పుస్తకాల కేటలాగులో "గ్రంధకర్త—పి. కె. పొనమరెంకో" అని వ్రాసివున్న కార్డులు 23 వున్నాయి. ఆ పుస్తకాల 18 శీర్షికలు, ఏ ప్రశ్నలనూ రేకెత్తించలేదు. ఈ ప్రచురణలలో అధికభాగం బైలోరష్యా మీద పొనమరెంకో వ్రాసిన ఉపన్యాసాలూ, వ్యాసాలూ, కరపత్రాలూ. భారత దేశానికి సోవియట్ రాయబారి బైలోరష్యా మంత్రివర్గాధ్యక్షునిగానూ, ఆ రిపబ్లిక్కు కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ ప్రధమ కార్యదర్శిగానూ ఉన్నత కార్యనిర్వాహక పదవులలో పలుసంవత్సరాలున్నారని మా దేశంలో బాగా తెలుసును. ద్వితీయ ప్రపంచ యుద్ధఘటనల గురించి చిన్న పుస్తకాలు చాలా వ్రాయబడ్డాయి. ఫాసిస్టు వ్యతిరేక యుద్ధంలో పి. పొనొమరెంకో, చాలా మంది సోవియట్ రాజకీయ వేత్తలవలె, యుద్ధంలో అనేక అధికార పదవులకు నియమింపబడ్డారు. వివిధ యుద్ధ రంగాలలో ఆయన సైనిక మండలిలో సభ్యునిగా పనిచేశారు. యుద్ధకాలంలో చేసిన సేవలకు పి. పొనొమరెంకోకు రెండు ఆర్డర్స్ ఆఫ్ లెనిన్, మొదటి తరగతి ఆర్డర్ ఆఫ్ సువరోవ్, మొదటి తరగతి ఆరర్ అఫ్ పేట్రియాటిక్ వార్ బహూకరింపబడ్డాయి. 1945లో పోలిష్ ప్రభుత్వం పి. పొనొమరెంకోకు అత్యున్నత సైనిక బహుమతి అయిన మొదటి తరగతి ఆర్డర్ ఆఫ్ గ్రున్‌వాల్డ్‌ను బహూకరించింది.

పొనొమరెంకో కరపత్రాలూ, ఉపన్యాసాలలో కొన్ని కజక్‌స్తాన్లో బీళ్ళ సేద్యానికి సంబంధించినవని కేటలాగు కార్డులు సూచించాయి కూడా. ఇది సమంజసమే. 1954లో బీళ్ళ భూముల అభివృద్ధికి గొప్ప ఉద్యమం సాగుతూ వున్నప్పుడు పి. పొనొమరెంకో "సమృద్ధిగా ధాన్యం పంటకొరకు పోరాటం"లో ముఖ్యమైన ప్రదేశ కజక్‌స్తాన్‌కు పంపబడ్డారు.

కేటలాగులోని ఐదు కార్డులు నాకు ఆశ్చర్యం కలిగించాయి. పంతెలైమొన్ కోంద్రత్యేవిచ్ పొనొమరెంకో, వితాలీ అలెగ్జాంద్రోవిచ్ రకోవ్ ఎలెక్ట్రిక్ రైళ్ళు—డ్రైవర్లకూ, వారి సహాయకులకూ ఒక దర్శిని అన్న ఒక సాంకేతిక పాఠ్యగ్రంధం ఐదు ముద్రణలకు గ్రంధకర్తలు. ఈ పాఠ్యగ్రంధపు తొలి ముద్రణ 1938లోనూ, ఐదవది 1956లోనూ వెలువడ్డాయి.

ఈ పుస్తకాన్ని నేను గ్రంధాలయంనుండి తీసుకున్నాను. ఇది ఆరు వందలకు పైగా పుటలుగల ఒక పెద్ద పుస్తకం; దానిలో డ్రాయింగులు, డయాగ్రాములూ, ఛాయాచిత్రాలూ ఉన్నాయి. ఈ గ్రంధకర్తల్లో ఒకరూ—ప్రముఖ రాజకీయవేత్త, సోవియట్ దేశ సుప్రీం సోవియట్ సభ్యుడూ, సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ సభ్యుడూ అయిన వ్యక్తీ ఒకే యింటిపేరుతో వున్నవారేమో అని అనుకున్నాను.

రాయబారితో నా ఇంటర్వ్యూ "ఒకే యింటిపేరుతో గల మనుష్యుల" విషయంతో మొదలైంది. కాని, ఎలెక్ట్రిక్ రైళ్ళ గురించి సోవియట్ దేశంలో వెలువడ్డ మొదటి పాఠ్యగ్రంధం గ్రంధకర్తలో ఒకరితో నేను మాటాడుతున్నానని తదుపరి తెలుసుకున్నాను.

ఈ గ్రంధం మొదటి ముద్రణ వెలువడ్డప్పుడు పి. పొనొమరెంకో వయస్సు 36 ఏళ్లు, కాని అప్పటికే ఆయనకు రైలు రవాణా

గురించి గొప్ప పాండిత్యం వుంది. మొదట స్టోకర్‌గానూ, తరవాత అసిస్టెంట్ డ్రైవర్‌గానూ, చివరికి డ్రైవర్‌గానూ రైల్వేలో ఆయన 18వ సంవత్సరంనుండి పనిచేశారు. మాస్కో-రవాణా ఇంజినీర్ల విద్యాలయంలో ఆయన పట్టభద్రుడయ్యాక, ఓల్గా మీదుగా ఒక వంతెన నిర్మాణం జరుగుతూ వున్నప్పుడు పొనొమరెంకో ఒక సెక్షను సూపరెండెంటుగా వున్నారు. పనినుండి పరిశోధనకు బదిలీ చెయ్యబడేంతవరకూ ఆయన పసిఫిక్ తీరంలో రైల్వే నిర్మాణంలో పాల్గొన్నారు. సోవియట్ దేశ సోవి ఎలెక్ట్రో టెక్నికల్ విద్యాలయాధిపతిగా నియమింపబడ్డారు. ఇక్కడనే పి. పొనొమరెంకో, ఆయన సహోద్యోగి వి. రకోవ్ ఎలెక్ట్రిక్ రైళ్ళ గురించి పాఠ్యగ్రంథం వ్రాసేరు.

"రైల్వే పని మీ మొదటి వృత్తా?" అని అడిగాను, రాయబారిని.

"కాదు, అది రెండవది. పన్నెండేళ్ళ వయస్సులో నేను పనికి వెళ్ళాను. వేగన్ చక్రాల ఆక్సిల్సును అమర్చడమూ, గుర్రాలకు నాళ్ళు వేయడమూ చేసే ఒక చిన్న కమ్మరి దుకాణంలో నాకు పని దొరికింది. అవసరమైతే యిప్పుడు కూడా నేనా పనులు చెయ్యగలననుకుంటాను" అన్నారు రాయబారి.

"మీరు దక్షిణాదిని, ఉక్రెయిన్లో పుట్టారా?" అని నేను అడిగాను. రాయబారికి దక్షిణాది వారికుండే గోధుమ రంగు కళ్ళున్నాయి, ఆయన ఉక్రేకియను అని సూచించే 'ఓ' యింటి పేరుకు చివరనుంది.

"అవును, నేను దక్షిణాదివాణ్నే, కాని ఉక్రేనియన్‌ను కాను. నేను క్యూబన్‌కు చెందినవాణ్ని. నేనొక కోసక్కు గ్రామంలో పుట్టాను. కాని తరవాత మా కుటుంబం అక్కణ్నుండి కొండల ప్రాంతమైన ఒక చెర్కెస్ గ్రామానికి తరలి వెళ్ళింది. నేను నా బాల్యం అక్కడే గడిపాను, మా భాష రష్యను మాటాడినంత బాగా, చెర్కెస్ భాష మాటాడడం నేర్చుకున్నాను. ఆ గ్రామంలోని నా స్నేహితులతో యిప్పటికీ ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుతూ వుంటాను. చాలా ఏళ్ళ తరవాత చెర్కెస్ భాషాజ్ఞానం నాకు చాలా ఉపయోగపడింది. నేను కజక్‌స్తాన్లో పనిచేసినప్పుడు, కజక్ భాషను నేర్చుకోవడం నాకు సులభమైంది—దాని పదజాలం, చెర్కెస్ భాష పదజాలానికి చాలా చేరువగా వుంటుంది.

"కకేషియను పర్వత ప్రాంతాల్లో నాకు విప్లవ కార్యాలతో సంబంధం ఏర్పడింది. జోక్యం కలుగజేసుకున్న దేశాలకూ, విప్లవ ప్రతికూల శక్తులకూ వ్యతిరేకంగా పోరాడుతున్న గెరిల్లా దళంలో నేను, నా పదహారవ ఏట చేర్చుకోబడ్డాను."

"మీరు కమ్మరిగా, రైలు డ్రైవరుగా, వంతెనల, రైల్వేల నిర్మాతగా పనిచేశారు, కార్యనిర్వాహక పదవులలో ఉన్నారు. ఏ కార్యరంగం మీకు అన్నిటికంటె ఎక్కువ సంతృప్తినిచ్చింది?"

"విశాలార్థంలో నిర్మాణం నాకు ఎక్కువగా నచ్చిందనుకుంటాను. బైలో రష్యాలోనూ, కజక్‌స్తాన్లోనూ నిర్మాణంలో నేను చాలా పనిచేశాను. బైలో రష్యాకంటె ఫాసిస్టుల వల్ల యింకే దేశమూ యింత ఎక్కువగా నష్టపోలేదు. దురాక్రమణదారులు, ఆ రిపబ్లిక్కులోని జిల్లాలకు జిల్లాలే నివాస ప్రదేశాలను నాశనం చేశారు. బైలో రష్యా అనేక సంవత్సరాలకాలంలో పునర్నిర్మింపబడింది. కజక్‌స్తాన్ బీళ్ళలో, శతాబ్దాలుగా నిర్మానుష్యంగా వున్న స్థలాలలో లక్షలాదిమంది ఐచ్ఛిక నివాసుల కొరకు నివాస గృహాలూ, పాఠశాలలూ, ఆసుపత్రులూ, దుకాణాలూ, వర్క్‌షాపులూ నిర్మాణం సాగింది.

ఆ జాతుల రిపబ్లిక్కులు, బైలో రష్యా, కజక్‌స్తాన్లలో నేను చేసిన పని నాకు చాలా యిష్టమైనది. భౌగోళికంగా అవి ఒకదానికొకటి దూరమైనవి. దేశపు చివర భూభాగాలైన వీట్లలో, ఆర్థిక సాంస్కృతిక పురోగతిలో అతి అల్పకాలాన ఒక పెద్ద అభివృద్ధి జరిగింది—యీ దృష్ట్యా అవి సన్నిహితమైనవి."

"మీరు భారతదేశానికి వెళ్ళడం, యిదే తొలిసారా?"

"అవును. భారతదేశం గురించి నేను చాలా చదివాననుకొంది. కాని వ్యక్తిగతంగా భారతదేశ ప్రజలతో పరిచయం నాకు 1953లో మాత్రమే కలిగింది, మాస్కోలో ప్రథమ భారతీయ చిత్రకళా ప్రదర్శనంలో, సోవియట్ దేశ సంస్కృతీ మంత్రిగా, ఆ ప్రదర్శనం ఏర్పాటులో నేను పాల్గొన్నాను. అక్కడ నేను భారతీయ చిత్రకారులను కలుసుకున్నాను. నా భావి మిత్రుడు, సోవియట్ దేశానికి భారత రిపబ్లిక్ రాయబారి అయిన శ్రీ కె. పి. యస్. మీనన్‌తో పరిచయమైంది కూడా, మా స్నేహసంబంధాలకదే మొదలు. ఆ తరవాత నేను శ్రీ మీనన్‌ను సహోద్యోగిగా చాలాసార్లు కలుసుకున్నాను. మేము కొన్నిసార్లు వార్సాలో కలుసుకున్నాము. పోలెండుకు భారత రాయబారిగా శ్రీ మీనన్ వస్తుండేవారు. నేను పోలండుకు, రెండేళ్ళు హాస్త పైగా రాయబారిని.

"స్నేహభావంతోనూ, పరస్పర అవగాహనతోనూ గత రెండేళ్ళలో మన సంబంధాలు ఎంతో చక్కగా ఏ దేశంతోనైతే పెంపొందుతోవున్నవో ఆ శాంత దేశంలో సోవియట్ దేశానికి ప్రాతినిధ్యం వహించే యీ ఘనతరమైన దౌత్య బాధ్యతను నేను సంతోషపూర్వకంగా స్వీకరించాను. మన యీ రెండు మహత్తర శాంతి కాముక, సోదర ప్రజలను సన్నిహితులను గావించే మహదాశయ సేవకు సాయశక్తులా కృషిచేయడం గొప్ప సంతోషకరమైన విషయంగా నేను పరిగణిస్తాను."

10 డిసెంబర్ 1957, మంగళవారం భారత దేశానికి సోవియట్ రాయబారి శ్రీ పి. కె పొనొమరెంకో పాలం విమానాశ్రయంలో దిగినప్పటి దృశ్యం. శ్రీ ఎం ఆర్. ఎ. బేగ్ (కుడిన), చీఫ్ ఆఫ్ ప్రొటోకోల్‌తో పాటు ఆయనకు పలువురు ఘనస్వాగతమిచ్చారు. (కుడినుండి రెండవ వ్యక్తి) శ్రీ ఎన్. క్రియుకోవ్, తాత్కాలిక సోవియట్ రాయబారి. ఎడమను పొనొమరెంకో సతీమణి



# "స్పుత్నిక్కులు"

*(గత సంచిక తరువాయి)*

రెండవ స్పుత్నిక్కులోంచి కొలతలను తీసుకొనడం కార్యక్రమం ఏడురోజుల వరకు కొనసాగడానికి యేర్పాట్లు గావింపబడ్డాయి. ఏర్పాట్ల ప్రకారం పని కొనసాగింది. స్పుత్నిక్‌లోని రేడియో ప్రసార యంత్రాలు, రేడియో టెలిమీటరింగ్ యంత్రపరికరాలు ఇప్పుడు పనిచేయడం మానేసాయి. వాతావరణపు పై పొరల స్వభావాన్ని పరిశోధించడానికి రెండవ స్పుత్నిక్ గమనాన్ని పరిశీలించడమూ, దాని గమన మార్గాన్ని గురించి ముందుగా చెప్పడమూ ఇప్పుడు రాడార్ సహాయంతోనూ, దృక్ యంత్రపరికరాల సహాయంతోనూ జరుగుతున్నది.

## రోదసీయానంలో జీవిమనుగడపై పరిశోధనలు

వైద్య, జీవశాస్త్ర సంబంధమైన సమస్యలను గురించి పరిశోధనలు జరుపడానికి స్పుత్నిక్‌లో పరిశోధనార్థం ఒక జంతువును ("లైకా" అనే పేరిట ఉన్న కుక్క) ఉంచి గాలి చొరకుండా బిగించిన ఒక అర, ఆ జంతువుయొక్క శారీరక విధులను రికార్డు చేయడానికి కొలత పరికరాలు, గాలిని పరిశుద్ధి చేయడానికీ, జంతువుకు ఆహారం పెట్టడానికీ, అది విసర్జించే మలాన్ని తొలగించివేయడానికీ అవసరమైన పరికరాలు ఉంచబడ్డాయి. స్పుత్నిక్ బరువు తప్పనిసరి అయినదానికంటే యెక్కువ కాకుండా, సాధ్యమైనంత తక్కువ విద్యుచ్ఛక్తితో పనిచేయడానికి వీలుగా పై యంత్ర పరికరాలన్నీ తయారు చేయబడ్డాయి.

స్పుత్నిక్‌లోని యంత్రపరికరాలు చాలా కాలంవరకు పనిచేస్తూ, జంతువుయొక్క నాడి కొట్టుకొనే క్రమాన్నీ, ఉచ్ఛ్వాస నిశ్వాసాలనూ, రక్తనాళాల్లోని రక్తపు వత్తిడినీ, గుండె యొక్క జీవశక్తినీ, జంతువు ఉంచబడిన అరలోని తాపక్రమం, గాలి వత్తిడి మొదలైనవాటిని రేడియో టెలిమీటరింగు యేర్పాట్లు ద్వారా రికార్డు చేస్తూవచ్చాయి.

జంతువు ఉన్న అరలోని గాలిని పరిశుద్ధం చేసి, అవసరమైన వాయుమిశ్రమాన్ని కలిగించేందుకు, ఊపిరి తీయడానికి అవసరమయిన ప్రాణవాయువును విడుదలచేసి, బొగ్గు పులుసు వాయువును, ఇతర అదనపు వాయువులను పీల్చుకొనడానికి అతిచురుకుగా పనిచేసే రసాయనిక మిశ్రమాలు ఉపయోగింపబడ్డాయి. వాటిలో కొనసాగే రసాయనిక ప్రక్రియలు

*

రెండవ సోవియట్ స్పుత్నిక్‌లో వైద్య, జీవశాస్త్ర విషయిక పరిశోధనలకు ఏర్పాట్లు




1. జంతువుల ఆర్గానిజంలపై ప్రభావాన్ని చూపే అంశాలు.
2. పరిశీలనలో వున్న ఆర్గానిజంల పనులు.
3 రేడియో ట్రాన్స్‌మిటర్లు.
4. రేడియో రిసీవర్లు.
5. రిజిస్టరింగ్ పరికరాలు.

*

ఎ. కాస్మిక్ కిరణాలు.

బి. సూర్యకాంతి (అల్ట్రావైలెట్, ఇన్‌ఫ్రా రెడ్, ఎక్స్‌రే కిరణాలు).

సి. భారరహితము.

డి. ఊపిరి పీల్చుట.

ఇ. గుండెకొట్టుకొనుట.

ఎఫ్. రక్తపు పోటు.

జి. కాలానుక్రమంగా సేకరించిన సమాచారాన్ని రేడియో ట్రాన్స్‌మిటర్ల ద్వారా పంపుటకు అమర్చబడిన ప్రత్యేక సాధనం.

స్వయంచలన పద్ధతిద్వారా కంట్రోలు చేయ బడుతూవచ్చాయి. భూమ్యాకర్షణశక్తి పూర్తిగా లేని పరిస్థితుల్లో గాలి కన్వెక్షన్ ఉండదుగాబట్టి జంతువు ఉన్న అరనుండి గాలి తప్పనిసరిగా బయటికిపోయే యేర్పాట్లు చేయబడ్డాయి. వేడి రెగ్యులేటింగ్ సిస్టమ్ ద్వారా లోపలి తాపక్రమం ఒక నిర్ణేశితస్థితిలో ఉంచ బడుతూ వచ్చింది. ప్రయాణ సమయంలో జంతువుకు ఆహారాన్నీ, నీటినీ అందిజేసేందుకు ప్రత్యేకమైన యేర్పాట్లు గావింపబడ్డాయి.

స్పూత్నిక్‌లో రోదసిలోకి పంపబడిన కుక్క లైకాకు అంతకుపూర్వమే అవసరమైన శిక్షణ యివ్వబడింది. రక్షణ కల్పించబడిన పరిస్థితుల్లో ప్రత్యేకంగా తయారు చేయబడిన దుస్తులతో, గాలి చొరబడకుండా బిగింపబడిన అరలో ప్రయాణం చేయడానికీ, దాని శారీరక విధులను రికార్డు చేసేందుకు దాని శరీరం వివిధ భాగాల్లో యంత్ర పరికరాల ఏర్పాటుకూ, ఇంకా ఇలాంటి ఇతర విషయాలకూ అది బాగా అలవాటు పడింది. అలాంటి పరిశోధనా పరిస్థితుల్లో ఈనటానికిగూడా దానికి శిక్షణ యివ్వబడింది. కంపన పరిస్థితుల ప్రభావానికీ, ఇతర విషయాల ప్రభావానికీ అది యెలా తట్టుకొనగలదో పరిశోధనాశాల పరిస్థితుల్లో గమినించడం జరిగింది. కొన్ని వారాల పాటు యివ్వబడిన సుదీర్ఘ శిక్షణానంతరం ఆ జంతువు గాలి చొరకుండా బిగింపబడిన అరలో ప్రశాంతంగా వుండడానికి అలవాటు పడ్డది. ఆ విధంగా అది వైజ్ఞానిక పరిశోధనలను కొనసాగించడానికి దోహదమిచ్చింది.

రోదసిలో ప్రయాణం చేసేప్పుడు జీవియొక్క ప్రవర్తన యెలా గుంటుందో తెలుసుకోడానికి సంబంధించిన జీవశాస్త్ర విషయక పరిశోధనలు, భూతలంనుండి వంద, లేదా రెండు వందల కిలోమీటర్ల యెత్తుకు జంతువులను కొద్ది కాలంపాటు పంపుటద్వారా జరిగిన విస్తృత పరిశోధనల వల్ల సాధ్యమయ్యాయి. సోవియట్ దేశంలో యీ పరిశోధనలు కొన్ని సంవత్సరాలపాటు కొనసాగాయి.

లోగడ జరిగిన పరిశోధనల విషయంలో వలెగాక, ఇప్పటి స్పూత్నిక్‌లోని జంతువుయొక్క ప్రయాణం భూమ్యాకర్షణశక్తి యేమాత్రమూ లేని పరిస్థితులు జీవిపై యెలాంటి ప్రభావాన్ని కలుగజేస్తాయి అన్న విషయాలను గురించి పరిశోధనలు జరపడానికి తోడ్పడ్డవి. ఇంతవరకు భూమ్యాకర్షణ శక్తి యేమాత్రమూ లేని పరిస్థితియొక్క ప్రభావాన్ని గురించి కొద్ది సెకెండ్లపాటు విమానయానం ద్వారా జరిగిన పరిశీలనలవల్లా, రాకెట్లను పైకి యెగరగొట్టిన సందర్భంలో కొద్ది నిముషాలపాటు జరిగిన పరిశీలనవల్లా మాత్రమే తెలుసుకొనడం సాధ్యమయింది కాని ఈ స్పూత్నిక్, భూమ్యాకర్షణ శక్తి పూర్తిగా లేనిస్థితిలో జీవి మనుగడ యెలాగుంటుందో కొన్ని రోజులపాటు పరిశీలించడానికి అవకాశాన్ని కల్పించింది.



సౌరవర్ణ పటలంయొక్క 'అల్ట్రావైలెట్,' 'ఎక్స్‌రే' మండలాల విషయమై పరిశోధనలు జరపడానికి రెండవ స్పూత్నిక్కులో అమర్చబడిన పరికరాలు



వైద్య, జీవశాస్త్ర విషయిక పరిశోధనా కార్యక్రమం విజయవంతం కావడంవల్ల చేకూరిన పరిశీలనా సమాచారం ఇప్పుడు సమగ్రంగా పరిశోధింపబడుతున్నది. పరిశోధనార్థం ఉంచబడిన జంతువు, స్పూత్నిక్ దాని కక్ష్యలోకి పంపబడినప్పటి తీవ్రవేగానికీ, అటు తర్వాత కొన్నిరోజులపాటు భూమ్యాకర్షణ శక్తి యేమాత్రమూ లేని పరిస్థితికీ తట్టుకొనగలిగిందని ఇప్పుడు కచ్చితంగా చెప్పవచ్చును. స్పూత్నిక్‌నుండి అందిన సమాచారాన్నిబట్టి పరిశోధన జరుగుతూ వుండినంతకాలము జంతువుయొక్క పరిస్థితి సంతృప్తికరంగానే ఉండినదని వెల్లడవుతున్నది.

ఈ పరిశోధనలు, విజయవంతంగా కొనసాగబోయే అంతర్గ్రహ ప్రయాణాలకు తోడ్పడి, రోదసీయానంలో మానవుల భద్రతను గ్యారంటీ చేసే సాధనాలను రూపొందించడానికి దోహదం చేస్తాయన్నదాంట్లో సందేహమేమీ లేదు.



సోవియట్ దేశంలో రెండు స్పూత్నిక్‌లు రోదసిలోకి యెగుర వేయబడడం, వాతావరణపు పైపొరలను గురించి పరిశోధనలు జరపడానికి తోడ్పడి, విశ్వానికి సంబంధించిన మానవుని పరిజ్ఞాన పరిధులను విస్తృతం గావిస్తుంది. అంతేగాక ఇది మా దేశంయొక్క వైజ్ఞానిక, సాంకేతిక ఉన్నత స్థాయినిగూడా వ్యక్తంచేస్తుంది. సూర్యమండలంచుట్టు వున్న రోదసిలో మానవుడు స్వయంగా పరిశోధనలు జరిపేరోజు వస్తున్నదన్న విషయాన్ని మనం తెలుసుకోడానికిగూడా తోడ్పడుతుంది.

# మానవుడి పోట్లు

కథకుడు: మిఖయిల్ షోలఖోవ్ అనువాదకుడు: శ్రీ.శ్రీ.

(23వ సంచిక తరువాయి)

మబ్బుల్లోంచి వచ్చే సూర్యకాంతిలాగ, సుమారు మూడు నెలలతర్వాత, నాకు బ్రహ్మానందంకలిగించే వార్త వచ్చింది. నా అంటోలీ బ్రతికే వున్నాడు. ఇంకొక 'డివిజన్' నుంచి, వాడు నాకు ఉత్తరం వ్రాశాడు. నాకు ఉత్తరం వ్రాసిన పొరుగింటి అతని ద్వారా వాడు నా అడ్రస్సు తెలుసుకోగలిగాడు. మొట్టమొదట, 'ఆర్టిలరీ' కాలేజికి వెళ్ళాడంట. అక్కడ వాడితెలివితేటలు బాగా వుపకరించాయంట. ఒక సంవత్సరం అయిన తర్వాత వాడు పరీక్షల్లో ఫస్టుగా ప్యాసయి, 'ఫ్రంటు'కి వెళ్ళాడంట. వాడు నాకు ఉత్తరం వ్రాసే సమయానికి, వాడు సలఫై అయిదుగురుండే ఒక దళానికి కెప్టెన్‌గా పనిచేస్తున్నాడంట. పైగా, వాడికి, ఆరు 'ఆర్డర్లు' ఒక 'మెడల్' బహుమతిగా ఇచ్చారంటకూడా. ఒక్క మాటలో చెప్పాలంటే, ముసలి తండ్రిని వెనక్కి నెట్టేసి, వాడు చాలా ముందుకు పోయేడన్న మాట. చూస్తూండగానే, నా కొడుకింతవాడైనందుకు, నేనెంతో గర్వించాను. నువ్వేమైనా చెప్పు. నా కొడుకు ఒక 'కేప్టన్', ఒక దళానికి 'కమాండర్' అంటే మాటలా? అందులో ఆ 'మెడల్స్' కూడా. వాడి తండ్రి ఒక సాధారణ సైనికుడైనంత మాత్రాన వాడికి పోయిందేముంది? అదంతా గతం. ఇప్పుడు తనొక కెప్టెన్....కమాండర్.... తనకెంత భవిష్యత్తుంది?!!



మిఖయిల్ షోలఖోవ్

రాత్రుళ్ళు నాకు ముసలాళ్ళకొచ్చే కలలు అదేపనిగా రావటం మొదలెట్టాయ్ ...యుద్ధం అయిపోయిన వెంటనే వాడికి పెళ్ళిచేసి, వాడి పిల్లలతో కులాసాగా వుంటాననీ ..., ఏదో కాస్త వడ్రంగిపని చేస్తూ, కుర్రాళ్ళనూ చూసుకుంటూ వుండిపోతాననీ....ఇంకా ఏమి టేమిటో....అన్నీ అలాటి కలలే ...కాని అలా అట్టేకాలం జరగలేదు. చలికాలం వచ్చేటప్పటికి, మా దళం అదేపనిగా ముందుకు పోవటం మొదలైంది....అప్పుడు మాకు ఒక్కక్షణంకూడా తీరిక వుండేదికాదు . . అలా కొన్నాళ్ళు, మేం ఇద్దరం తరచూ ఉత్తరాలు వ్రాసుకునే అవకాశం లేకుండా పోయింది ...కాని యుద్ధం ఆఖరయ్యే రోజుల్లో, మేం 'బెర్లిన్'కు దగ్గరగా వున్నప్పుడు, అంటోలీకి ఒక ఉత్తరం వ్రాశా. ఆశ్చర్యం! ఆ ఉత్తరానికి, మర్నాడే జవాబొచ్చేసింది. చిత్రమేమిటంటే, వాడూ, నేనూ కూడా ఒక్కనీ మకాం పట్టణానికి వేరువేరు మార్గాల్లో చేరుకున్నాం—ఇద్దరం అంత దగ్గర్లో వున్నందున, ఎప్పుడు కలుసుకుంటామా అన్న ఆతృత క్షణక్షణానికి ఎక్కువయ్యేది .. నేను వేచి వుండిన క్షణం రానే వచ్చింది ..మే తొమ్మిదవతారీఖు. ఆ రోజే రష్యా విజయాన్ని సాధించింది—ఆ ప్రొద్దున్నే, ఒక జర్మన్ ముందాకొడుకు నా కొడుకుని పొట్టబెట్టుకున్నాడు.

ఆ మధ్యాహ్నం, మా కమాండర్ నన్ను పిలిచాడు. అతనితోబాటు, ఒక కొత్త 'ఆర్టిలరీ' ఆఫీసరుకూడా కూర్చున్నాడు. ఏదో తన కన్నా పెద్ద ఆఫీసరొచ్చినట్టు. నేను గదిలోకి వెళ్ళగానే, అతను లేచి నుంచున్నాడు. మా కమాండర్ 'సొకొలోవ్! అతను నిన్ను కలవటానికి వచ్చాడు' అని కిటికీవైపు తిరిగిపోయాడు. ఏదో ఆపత్తు రాబోతోందని అనుకున్నా. వెంటనే కరెంట్ 'షాక్' తిన్నట్టయింది. ఆ లెఫ్టినెంట్ కర్నల్ నా దగ్గరకొచ్చి "మీ కొడుకు .కెప్టెన్ సొకొలోవ్ ఇవాళ చనిపోయాడని చెప్పటానికి చాలా విచారిస్తున్నానండి! ధైర్యం చిక్కబట్టుకుని నాతో రండి ..." అన్నాడు.

అది వినగానే నా తల దిమ్మెత్తిపోయింది, ఆ తర్వాత జరిగిందేదీ నాకు స్పష్టంగా గుర్తులేదు. నేనూ, ఆ లెఫ్టినెంట్ కర్నల్, ఆ పెద్దకార్లో వెళ్తూ, వీధుల్లో చూసిన దృశ్యాలంతా కలలో చూసినట్టుగా వుంది. ఎర్ర సిల్కుగుడ్డ కప్పబడ్డ ఆ శవంముందు, సైనికులంతా వరసగా నిలబడ్డారు. ఇప్పుడు నిన్ను చూసినంత స్పష్టంగానే, నా అంటోలీనికూడా చూశాను సోదరా...ఔను .. నేను శవందగ్గరకు వెళ్ళాను. అక్కడున్నది నా కొడుకే. కాని అంటోలీ కాదు....నా అంటోలీ చిన్న కుర్రాడు ...ఎప్పుడూ నవ్వుతూ, నవ్వితే బుగ్గలు సొట్టపడి ముద్దొచ్చే కుర్రాడు. కాని, అక్కడున్నది. కండలు తిరిగిన అందమైన యువకుడు....అతను సగం మూసినకళ్ళతో, నాలో ఎక్కడో, ఏ భాగాన్నో తరచితరచి చూస్తున్నట్టనిపించింది .. అతని పెదవులమీద చిరునవ్వు సరిగ్గా, నా అంటోలీ నవ్వులాగే వుంది.... ఔను. వాడే నా అంటోలీ. ఒక్కసారి ముద్దెట్టుకుని, ప్రక్కకు

తొలగిపోయా. లెఫ్టినెంట్ కర్నల్ ఏవో ఉపన్యసించాడు....వాడి స్నేహితులంతా కళ్ళనీళ్లు తుడుచుకుంటున్నారు....నేను ఏడవ లేక పోయా సోదరా....ఏడవలేక పోయా....నా కళ్ళల్లో నీళ్ళేలేవు.... అవి ఏనాడో నా గుండెలోనే ఇంకిపోయాయి .... అందుకే...., సోదరా...., ఆ దృశ్యం...., నన్నీనాటికీ అంత ఘోరంగా తినేస్తుంది....నా తుదికోర్కె అంతటితోనే అంతం అయిపోయింది.... అతని దీర్ఘ ప్రయాణానికి వీడ్కోలు చెప్తూ సైన్యం ఫిరంగులు పేల్చింది....ఎవరో నాలోనే ఫిరంగి పేల్చినట్టయింది....తర్వాత నేను నేనుగా మా 'యూనిట్'కి వెళ్ళలేకపోయా. నేను చచ్చిపోయా. అయినా నా శరీరం బ్రతుకుతోంది. అంతే. ఆ తర్వాత, సైన్యం లోంచి నాకు విముక్తి కల్గింది. ఎక్కడకు వెళ్ళను ? 'ఒబనెజా'కా ? ఎందుకూ ? పాడుబడ్డ ఆ గోతిని చూసుకోడానికా ??? 'ఉర్యుపిన్స్క్'లోని ఒకమిత్రుడు, ఎప్పుడో, నన్నువచ్చి అతనితో వుండమన్నాడు. అది గుర్తుకొచ్చింది .. సరే అక్కడికెళ్ళాను.

పాపం, నా మిత్రుడికి పిల్లల్లేరు. అతనూ, అతని భార్యా వాళ్ళు స్వంతంగా కట్టుకున్న గుడిసెలో వుంటున్నారు. అతనికేదో కొంత 'పింఛను' వస్తుంది. అది చాలక, ఒక లారీ డిపోలో, డ్రైవర్‌గా పనిచేస్తున్నాడు....అక్కడే నాకుకూడా వుద్యోగం వచ్చింది....నేను వాళ్ళింట్లోనే వుండేవాణ్ని....ఇద్దరం వేర్వేరు లారీలను నడిపి, రాత్రికి ఇంటికి చేరుకునేవాళ్ళం....ఈ కొత్త కొడుకు, నాకు అక్కడే దొరికాడు....సాధారణంగా, దూరప్రయాణం చేసి, వచ్చిన వెంటనే, ఏదైనా తినాలని హోటలుకు వెళ్తావ్....అన్నిటి కంటే ముందు, అలసట తీర్చుకోటంకోసం, ఒక గ్లాసుడు 'ఓడ్కా' తాగుతావ్....ఏం అలాచూస్తావ్ ? నీ కలవాటు లేదా ? ఏమోమరి ! నేనుమటుకు దానికి చాలా ఘోరంగా అలవాటుపడ్డాలే. ఒక రోజున, ఈ కుర్రాణ్ని అక్కడ చూశా....మళ్ళీ మర్నాడుకూడా చూశా.... నూనె రాయకపోవటం వల్ల పీచులాటి వాడి జుట్టు కళ్ళల్లో పడుతూండేది. వాడి ముఖంనిండా మట్టి కొట్టుకుపోయి నల్లగా మాడిపోయి వుండేది. వాడి కళ్ళు లోతుకుపోయి జాలి గొలిపేట్టుండేవి. అయినా వాడి చూపులో ఏదో వెలుగుంది....వాడు చిన్నినోరు విప్పి నవ్వితే ముత్యాలు రాలినట్టుగా వుండేది....నవ్వినప్పుడు వాడి ముఖంచూస్తే, ఎంత ముద్దొచ్చేదనుకున్నావ్ ! అందుకే, వాణ్ని రోజూ చూడాలనిపించేది. రోజూ వాణ్ణి చూడటంకోసం, పనికూడా త్వరగా పూర్తి చేసుకుని ఆ కాఫీ హోటల్‌కు చేరుకునేవాణ్ణి. ఆ కాఫీ హోటల్ మెట్లే వాడి నివాసం...., వాళ్లూ వీళ్లూ పెట్టేదే వాడి భోజనం.

ఆ నాలుగో రోజున, 'ఫారం' నుంచి లారీలోవస్తూ, తిన్నగా హోటల్ ఎదురుగానే ఆగాను. వాడు ఆ మెట్లమీద కాళ్లూపుతూ కూర్చున్నాడు....వాణ్ని చూడగా మహా ఆకలిగా వున్నట్టున్నాడు.... కిటికీలోంచి నా తల బైటకుపెట్టి పిలిచాను "హే వన్యా! ఇక్కడరా, పరిగెత్తుకురా... ఎలివేటర్‌దాకా వెళ్ళి తిరిగి వద్దాం. మళ్ళీ వచ్చి భోంచేద్దాం...." నా పిలుపు వినగానే, వాడు ఒక్క పరుగులో నాదగ్గరకు వచ్చాడు....కిటికీవైపు తలెత్తి, కళ్ళు పెద్దవిచేసి. అహోలా చూస్తూ "నా పేరు వన్యా అని నీకెలా తెల్సు ?" అని అడిగాడు.... అన్నీ తెల్సినవాళ్ళలో నేనుకూడా ఒకణ్నని వాడితో అన్నా....వాడు చుట్టు తిరిగి, కుడిచేతివైపుకొచ్చాడు. నేను తలుపుతీశా. వాడు లోపలకొచ్చి నా పక్కన కూర్చున్నాడు, వెంటనే మా లారీ కదిలింది. భలే తమాషా అయినవాడులే వాడు....ఏం మాట్లాడకుండా అలాగే కూర్చుండిపోయాడు. అస్తమానం నా వైపుచూస్తూ, నిట్టూర్చటం మొదలెట్టాడు. అంత కుర్రకుంక అప్పుడే నిట్టూర్చడటం నేర్చాడు....అలా చేయొచ్చా వాడు ? "వన్యా ! మీ నాన్న ఎక్కడున్నాడు ?"అని అడిగాను" "యుద్ధంలో చచ్చిపోయాడు" అన్నాడు వాడు. "అమ్మ ?" "రైలులో వస్తూంటే, బాంబుపడిచచ్చిపోయింది." అన్నాడు. "రైల్లో ఎక్కడ్నుంచి వస్తున్నారు ?" అని మళ్ళీ అడిగాను. "నాకు తెలీదు" "ఇంకెవరూ చుట్టాల్లేరా ?" "ఊహు ఎవ్వరూ లేరు" అన్నాడు వాడు బుర్రాడిస్తూ, "అయితే మరి నువ్వెక్కడ పడుకుంటావ్ ?" "ఎక్కడపడితే అక్కడ" అన్నాడు.

వాణ్ని చూస్తూంటే నా గుండె తరుక్కుపోయింది. ఎందుకిలా ఒంటరిగా వుండాలి ? వీణ్నెందుకు పెంచుకోకూడదు ? ఈవిధమైన ఆలోచనలు నా బుర్రలోకి రావటంతో, నాలో ఏదో తెలియని ఆనందం కలగసాగింది. వాడివైపు వంగి "వన్యా ! నేనెవరో తెల్సా ?" అని అడిగా. వాడలాగే చూస్తూ "ఎవరూ ?" అన్నాడు అమాయకంగా. "నేనే మీ నాన్నను" అన్నాను.

అప్పుడేం జరిగిందో తెల్సా ? నా మెడచుట్టూ చేతులువేసి, అమాంతంగా, నా పెదవులు, కళ్ళూ, బుగ్గలూ, నోరూ, ఒకటేమిటి అన్నీ, అదేపనిగా ముద్దెట్టుకోటం మొదలెట్టాడు. అంతటితో వదలకుండా "నాన్నా, నాకు తెల్సు నువ్వొస్తావని. ఎక్కడున్నా, వెతుక్కుంటూ వస్తావని నాకుతెల్సు నాన్నా" అంటూ నన్ను కరుచుకు

పోయాడు. ఆనందంతో నా కళ్ళు చెమ్మగిలి, దారి కనబడకుంటా పోయింది. నా చేతులు వణుకుతున్నాయ్. 'స్టీరింగ్'ని ఎలా పట్టుకోగల్గానో నాకే తెలీదు. అయినా భయమేసి, ఇంజన్ ఆపేశాను. నా కొత్తకొడుకు. ఇంకా నన్ను కరిచుపెట్టుకునే వున్నాడు. అయిదు నిమిషాలు అక్కడే వున్నాం, వాడింకా అలానే వున్నాడు. నా కుడి చేత్తో, వాణ్ణి పట్టుకుని, ఎడంచేత్తో 'స్టీరింగ్' పట్టుకుని, తిన్నగా ఇంటికి దారితీశా. అప్పుడు ఎలివేటర్‌కు వెళ్లాల్సిన సంగతే మర్చిపోయా.

గేటుదగ్గరే 'లారీ' ఆపేసి, నా కొత్త కొడుకుని ఎత్తుకుని లోపలికెల్లా. వాడు, నా చెంపలకు వాడి బుగ్గల నానించి, నా మెడను రెండు చేతుల్తో గట్టిగా పట్టుకుని వేళ్ళాడుతున్నాడు. ఆ సమయానికి, నా మిత్రుడూ, అతని భార్యా ఇద్దరూ ఇంట్లోనే వున్నారు. వాళ్ళనుచూసి ధైర్యంగా చెప్పాను. "ఆఖరికి, నా చిన్న కొడుకు వన్యాను ఈవాళ్టికి కనుక్కోగలిగాను" అని నేను అనగానే వాళ్ళు కనుక్కోగలిగారు. పిల్లల్లేని కారణంగా, పాపం, వాళ్ళకే, నా కొడుకుని చూసేటప్పటికే ఎంతో ముద్దేసింది....నా మిత్రుడి భార్య నా కొడుకుని తీసుకోబోయింది. నేను ఓవట్టాన విడవలేకపోయా.... తర్వాత, వాడిచేతులు సబ్బుతో కడిగి, టేబిల్‌దగ్గర కూర్చోబెట్టా. నా మిత్రుడి భార్య, వాడికి ఒక పళ్ళెంలో కొంత టిఫెన్ పెట్టింది. అది వాడు రెండు క్షణాల్లో తినేశాడు....వాణ్ణి చూస్తే ఆమె గుండె పగిలినట్టుంది. కళ్ళల్లో నీళ్ళు నిలచాయ్. అదిచూసి, వన్యా ఆమె దగ్గరకెళ్ళి ఆమె కళ్ళల్లోకి చూస్తూ "ఏడుస్తావెందుకు పిన్నీ ? నాన్న ఇవాళ నన్ను తీసుకొచ్చినందుకు నవ్వటం పోయి, ఏడుస్తావేం ?" అని అమాయకంగా అడుగుతుంటే ఆమె దుఃఖం పొంగి పొరలింది....ఆపుకోలేక వెక్కివెక్కి ఏడ్వటం మొదలెట్టింది....పాపం ! స్త్రీ హృదయం !!!

అన్నం తిన్నాక, వాణ్ణి మంగలిషాపుకు తీసుకెళ్ళి 'క్రాఫ్' చేయించాను....తర్వాత, నేనే స్నానంచేయించి, శుభ్రమైన తువ్వాలుతో తుడిచాను. నా మెడచుట్టూ చేతులువేసి, అలాగే నిద్రపోయాడువాడు. తర్వాత నెమ్మదిగా, వాణ్ణి పక్కమీద పడుకోబెట్టి, లారీతీసుకుని ఎలివేటరులో వెళ్ళి అక్కడనుంచి త్వరగా పని ముగించుకుని, బజారుకెళ్ళి వాడికొక జత ట్రౌజర్లు, ఒకచిన్నచొక్కా, ఒక జత జోళ్లు, ఒక చిన్న టోపీ కొని, గబగబ ఇంటికివెళ్ళా. తీరా చూస్తే అవేవీ వాడికి సరిపోలేదు. చివరకి "నీకేం పిచ్చెక్కిందా ? ఇంత ఎంతలో అలాంటి పాంట్లు తొడిగితే వాడేం అవుతాడు ?" అని మా స్నేహితుడి భార్య మందలించింది నన్ను.... ఆవిడకు కుట్టుపని తెల్సుకనక వెంటనే రెండు మామూలు ప్యాంట్లు, ఒక తెల్ల చొక్కా కుట్టి సిద్ధం చేసింది నా వన్యాకు.

వాడితోటాటే నేను కూడా పడుకున్నా. చాలాకాలం తర్వాత, మళ్ళీ సుఖంగా నిద్రపోవటం అదే మొదటిసారి. మొత్తంమీద నాలుగుసార్లు లేచానుకో అయినా నాకు హాయిగానేవుంది. వాడు నామెడకు మెలేసుకుని, పడుకుని మెత్తగా గాలి నాముఖంమీదను వదుల్తూంటే, నేనెంత సౌఖ్యం అనుభవించానో చెప్పటానికి ఏ భాషలోని పదాలైనా చాలవ్ సోదరా....

రోజూ ఇంచుమించుగా అదేవిధంగా జరిగేది....ఆ ఆనందంలోనే, గతంలో తగిలిన దెబ్బలన్నీ మరిచిపోగలిగేవాణ్ని....

మొదట్లో, నేను లారీ నడుపుతోంటే, వాడు నామీద స్వారీ చేసేవాడు....అది కష్టమైందని గుర్తించాక, వాణ్ని ఏదోలా మరపించి ఇంటిదగ్గరే వుంచాలని ప్రయత్నించా. అయినా కుదర్లే. మొత్తానికి ఎలా అయితేనేం, తెగించి, వాణ్ని ఆమెకు అప్పచెప్పి నేను పనిలోకి వెళ్ళేవాణ్ని....వాడు పగలంతా ఏడ్చి ఏడ్చి, సాయంకాలం అయ్యేటప్పటికి ఎలివేటరు దగ్గరకొచ్చి, నాకోసం కాచుకునేవాడు....అప్పుడిద్దరం కలసి ఇంటికొచ్చేవాళ్ళం....

ఎప్పుడూ మేంఇద్దరం కలిసే పడుకునేవాళ్ళం .. వాడెప్పుడూ నన్ను అంటిపెట్టుకునే పడుకునేవాడు. ఒక రోజున, నావైపు అదోలా చూడటం మొదలెట్టాడు. ఏం అలా చూస్తున్నావంటే "నీ తోలుకోటు ఎక్కడపెట్టావ్ ?"అని అడిగాడు....అసలు నాకెప్పుడూ అటువంటికోటు లేదు. అయినా, వాణ్ని సమాధానపర్చటంకోసం, "'ఒరనెట్'లో వదిలేశా"అని చెప్పా. వాడు అంతటితో ఊరుకోకుండా "నన్నిన్నాళ్ళవరకూ ఎందుకు చూళ్ళేదు?" అడిగాడు...."లేదు నాన్నా. నీకోసం అంతా వెతుకుతున్నా...... జర్మనీ, పోలెండు, వైలోరష్యా అన్నీ వెతికితే, చివరకు 'ఉర్యుపిన్‌స్క్'లో దొరికావ్" అన్నా. "అయితే మరి 'ఉర్యుపిన్‌స్క్' జర్మనీకంటే దగ్గరా ?, అది పోలెండుకు మనింటికంటే దూరమా ?" అని ఏవేవో అడిగేవాడు. అలాగే అడిగి అడిగి మగతకలగగానే నిద్రపోయేవాడు. వాడితోపాటే నేనూ కునుకు తీసేవాణ్ని.

అలా అసలు ఇంకో సంవత్సరంపాటు అక్కడే వుండే వాళ్ళం....కాని, ఈలోపున ఒక ప్రమాదం వచ్చింది....మట్టిరోడ్డు మీద ఒక గ్రామంలోంచి వచ్చేస్తున్నా ... అలా వస్తూవస్తూ ఆ పక్కనేవున్న చిన్న గోతిలోకి వెళ్ళిపోయింది లారీ. అక్కడే ఒక అవు వుండటం తటస్థించింది. వెళ్ళి లారీ దాన్ని ఢీకొంది....దాంతో ఏమౌతుందో నాకు తెల్సుగా .. అదమకయాశం చేసి, నన్ను హంగామా చేస్తుంటే, ఇంతలో, ట్రాఫిక్ ఇన్‌స్పెక్టర్ వచ్చి, నా డ్రైవింగ్ లైసెన్సు కాన్సిల్ తీసుకున్నాడు....తీరాచేసి అంతా అయ్యాక, ఆ అవు తోక పైకెత్తి, అక్కణ్ణుంచి రంకెవేసింది. కాని ప్రయోజనం ఏంటి ! నా లైసెన్సు కాన్సిల్ పోయింది. ఈమధ్య చలికాలంలో, మళ్ళీ డ్రైవింగ్ మొదలెట్టా. ఈ లోపునే, సైన్యంలోని పాతమిత్రుడొకడు కన్పించాడు....అతను మా జిల్లాలోనే డ్రైవర్‌గా పనిచేస్తున్నాడు....నన్నతను తనదగ్గరికి రమ్మన్నాడు....మళ్ళీ ఒక సంవత్సరం పని చేస్తే, అప్పుడు, లైసెన్సువస్తుందన్నాడు. అందుకని, ఇప్పుడూ నేనూ, నాకొడుకూ, 'కషారీ' వెళ్తున్నాం. అతనుండేది అక్కడే.

అసలా 'ప్రమాదం' జరగకపోయినా, అక్కడ ఆట్టేకాలం వుండేవాళ్ళంకాదులే. ఎందుకంటే, నా బాధలు ఎప్పుడూ గుర్తుకొచ్చి, ఎక్కువకాలం ఒకేచోట వుండనీయవ్. ఇంక నాకొడుకు పెద్దవాడై, చదువుకెళ్ళాల్సివస్తే, అప్పుడు ఎక్కడోఅక్కడ స్థిరపడక తప్పదులే, అంతవరకూ, వీడైనంతవరకూ రష్యా అంతా తిరుగుతూనే వుంటాం" అని అతను ఆగాడు.

"వాడు అలసిపోడా ?" అని అడిగాను.

"అలసిపోవటానికేంవుంది ? వాడెక్కువ నడవడు....ఎక్కువగా నామీద స్వారీ చేస్తాడు....ఇంక వాడికాళ్ళు తిమ్మిరెక్కితే, క్రిందకుదూకి, లేడిలా ఇటూ అటూ పరిగెడుతాడు. అదేం పెద్ద కష్టంకాదులే సోదరా....ఎలాగోలా నెట్టేస్తాం... కానివచ్చినచిక్కేమిటంటే, వున్నట్టుండి ఎప్పుడో ఒకప్పుడు నా గుండెల్లో ఎవరో బాకు దిగేసినట్టుగా వుంటుంది. నేనెప్పుడో నిద్రపోతూ, హఠాత్తుగా చచ్చిపోతే, నాచిన్నికొడుకు బెంగ పెట్టుకుంటాడనే భయపడతా. దీనికితోడు మరొకటి. .ఇంచుమించుగా, ప్రతీరాత్రీ, నన్ను విడిచి వెళ్ళిపోయిన, 'నా వాళ్ళంతా' కలల్లో కనిపిస్తారు. ఎక్కువగా ఒక తీగ. వాళ్ళంతా ఆ తీగకు అవతలవేపు, నేనొక్కణ్ణీ ఇవతల వేపు వున్నట్టుగా వస్తాయి కలలన్నీ. వాళ్ళతో మాట్లాడిసంపనేపు వాళ్ళు కనుపించి, నేనా తీగను లేపేసుటంతో వాళ్ళంతా కరిగిపోయినట్లు మాయమౌతుంటారు. ఇంకోచిత్రమేమిటంటే, పగలంతా నేను బాగానే వుంటా ...ఎక్కడా బాధగాని, బెంగగాని నాలో కనపడదు....రాత్రయితేనే అదంతా మారిపోతుంది. ఒకప్పుడు, ప్రొద్దున్నేలేచి చూస్తే, నా తలగడంతా కన్నీళ్ళతో తడిసిపోతుంది . ."అని ముగించాడతను.

ఒడ్డుకు సమీపిస్తున్న నా మిత్రుడి పిలుపు వినిపించింది. ఇంత తక్కువ కాలంలోనే, నాకు ఎంతో ఆప్తునిగా దగ్గరైపోయిన ఆ ఆగంతకుడు లేచి నుంచుని, తన దృఢమైన మోటుచేతిని నా వైపు చాచి, "గుడ్‌బై సోదరా. వెళ్ళోస్తా" అన్నాడు.

"గుడ్‌లక్. సుఖంగా వెళ్ళిరా"అన్నా అతనితో కరస్పర్శ చేస్తూ.

"థాంక్స్. వస్తా. అబ్బాయ్....పడు నావ దగ్గరికెళ్దాం" అనే టప్పటికి ఆ కుర్రాడొచ్చి, అతని చొక్కా చివర పట్టుకుని అతని అడుగుల్లో అడుగులు కలుపుతున్నాడు....విభిన్న ప్రాంతాలకుచెందిన ఇద్దరు అనాథలు, బీభత్సయుద్ధంవల్ల, ఆశ్చర్యంగా ఒక్కటయ్యారు. వారి భవిష్యత్తు ఎలావుందో....!!దిటవుగుండెగల ఆ రష్యా వీరుడు చిరకాలం శక్తివంతంగా బ్రతికి, తన చిన్నారి కొడుకుని, దేశాని కుపకరించే ఒక నిస్వార్థ పౌరుడుగా తయారు చేయగల్గువాడని మన స్ఫూర్తిగా ఆశించా.

వాళ్ళలా వెళ్తూంటే దిగాలుపడి చూస్తున్నా....వాళ్ళు మామూలుగా వెళ్ళిపోయుంటే బాగానేవుండును., కాని, కాని., ఆ చిన్నివన్యా. ..కొన్ని అడుగుల దూరం వెళ్ళాక, వెనక్కి తిరిగి తన చేతులు ఊపడం మొదలెట్టాడు....హఠాత్తుగా, ఎవరో నా గుండెను పిసుకుతున్నట్టయి, నా బుర్ర అటువైపుకు తిప్పేసుకున్నా. దానికి అతనెంత బాధ పడతాడో !! నిజమే....యుద్ధంలోనే తమ జీవితం అంతా గడిపిన ఈ ముసలివాళ్ళు బాధపడడమేకాదు....నిజంగా ఏడుస్తారు....ముఖ్యంగా లేదేసమయాల్లో....ఎదొచ్చి, అది చూడకుండా వుండగలగాలి. అన్నిటికన్నా ముఖ్యమైనది—, రావల చెక్కిళ్ళమీది ఆ వేడి కన్నీళ్ళనుచూస్తే చిన్ని పిల్లల హృదయం తల్లడిల్లుతుంది— అందుకని వాళ్ళకాఅవకాశమే కలగనీయకూడదు—— (సమాప్తం)



మహిళా మహోదయం:

# గొర్రెలకాపరి కూతురు నేటి విదేశాంగ మంత్రిణి

వీరా గొలుబెవా



తొకుస్మక్ వయస్సు నిండక ముందరే వృద్ధాప్యం వచ్చింది. ఆశ్చర్యమేమీలేదు, పసితనంనుండీ, బాల్యం అంతటా, గొర్రెల కాపరి కొందుచల్‌ను వివాహమాడిన తరువాత కూడా దురదృష్టమూ, దారిద్ర్యమూ ఆమెను వెన్నాడుతూనే ఉండేవి;

ప్రతి ఏడాదీ ఆమెకు సంతానం కలిగేది. కాని ప్రతిసారి ఆ కిర్గిజ్ గొర్రెల కాపరి గుడిసెలో వ్యాధులు ప్రవేశించేవి, పసిబిడ్డ మట్టి పాలయ్యేది.

## కలుయ్‌పా

1920లో ఆమె పదవ బిడ్డ కలుయ్‌పా పుట్టింది. కిర్గీజియాకు సోవియట్ పరిపాలన వచ్చిన సంవత్సరం అది. ఆమెకు, ఆమె భర్తకు పౌర హక్కులు వచ్చాయి.

సోవియట్ వైద్యులు వచ్చారు, కిర్గిజ్ ప్రజలకు వ్యాధులతో పోరాటం జరపడానికి సహాయపడేందుకు.

కలుయిపా బ్రతికింది, ఆ పిల్ల పెరుగుతుంది, కిర్గిజ్ ప్రజలు కూడా పెరుగుతున్నారు. కిర్గిజ్ ప్రజల శతాబ్దాల మనుగడలో తొలిసారిగా వారు తమ మాతృభాషలో ప్రచురింపబడిన ఎర్కిన్-తూ అన్న తొలివార్తాపత్రికను చదివినప్పటికి. ఆమె వయస్సు నాలుగేళ్లు.

కరద్జుగజ్ గ్రామంలో తొలిసారిగా ఉపాధ్యాయుడు కనిపించిన రోజును కలుయ్‌పా ఎన్నడూ మరిచిపోలేదు. ఉపాధ్యాయునికొరకు వేచివున్న విద్యాపిపాసులైన పిల్లలలో—పెద్దవారిలో కూడా—ఆమె కూడా ఒకతె.

## విద్యాభ్యాసం

"చదువుకంటె సుఖమైనదేదీ లేదు" అన్నాడు ఆమె తండ్రి, ఆ ముసలి గొర్రెల కాపరి. ఆమెకు 14 ఏళ్ళ ప్రాయాన ఉపాధ్యాయుల శిక్షణ పాఠశాలలో చేర్చేందుకు, ఆయన తన కుమార్తెను ఫ్రుంజ్ నగరానికి (రిపబ్లిక్ ముఖ్యపట్టణం) తీసుక వెళ్ళాడు.

తన కుమార్తె మొగపిల్లలతో కలిసి చదువవలసి వుంటుందని తెలుసుకొని, ముసలి కొందుచల్ హడలిపోయాడు. కాని ఆయన యుగయుగాల సాంప్రదాయాన్ని అతిక్రమించి, ఆమెను అక్కడ ఉంచాడు.

చదువు కష్టంగా ఉంది, కాని కలుయ్‌పా, తన చదువు ముగించుకునేసరికి అనర్ఘ పత్రాన్ని పొందిన కొద్దిమంది విద్యార్థులలో ఒకతె అయ్యింది.

సంచార పశుపాలకులు జీవించే, కిర్గీజియాలోని అతి మారుమూల ప్రదేశమైన కీజ-షాజ కొండలలో పనిచెయ్యడానికి ఆమె వెళ్ళింది, ప్రధానోపాధ్యాయినిగా నియమింపబడేసరికి ఆమె వయసు 19 ఏళ్ళు మాత్రమే.

## కీర్తి ప్రతిష్ఠలు

పాత దురభిప్రాయాలూ, సాంప్రదాయాలూ ఒకంతట విడిచిపెటలేదు. కలుయ్‌పా నతకంటె పెద్దవారైన స్త్రీలు బంధాలను తెంచుకుని, ప్రజా వ్యవహారాలలో చురుకుగా పాల్గొనేటట్టుగా సాయపడడానికి శాయశక్తులా కృషిచేసింది.

ఆమె కీర్తి త్వరలోనే వ్యాపించింది, కొద్దికాలంలోనే యీ బాలిక ప్రాంతీయ సోవియట్‌కు ఎన్నుకోబడింది, తొందర్లోనే ఆమె ఉపాధ్యక్షురాలిగా ఎన్నుకోబడింది.

యుద్ధపు రోజుల్లో ఆమె మాస్కోలో చదువుకుంటోంది, తరవాత ఉపన్యాసకురాలిగా, పత్రికా రచయిత్రిగా, ఒక కిర్గిజ్ పత్రికకు సంపాదకురాలిగా పనిచేసింది.

ఇప్పుడామె తమ రిపబ్లిక్కు విదేశాంగ మంత్రిణి, అఖిల సమాఖ్య పార్లమెంటులో సభ్యురాలు కూడా.

కిర్గీజియా జాతీయ కళా సారస్వతోత్సవం గొప్పగా చేయడానికి సన్నాహాలు చేస్తోంది. ఇది వచ్చే సంవత్సరంలో మాస్కోలో జరుగుతుంది. ఇందులో కలుయ్‌పా పాత్ర, ఒక కర్గిజ్ మహా గ్రంథం అయిన కిర్గిజ్ వీరుడు మనస్ సాహసకృత్యాలను వర్ణించిన త్రిసంపుట కావ్యాన్ని రష్యన్ భాషలోనికి అనువదించడం.

## కుటుంబం

కలుయ్‌పాకు ముగ్గురు బిడ్డలున్నారు—11 ఏళ్ళ దియస్, యిద్దరమ్మాయిలు గుల్జబాల్, ఇరీనా.

ముసలమ్మ తొకుస్మక్ పొడవుగా, సన్నగావున్న తనకుమార్తె కలుయ్‌పా, దియస్‌ను బడికి పంపుతూవుంటే చూస్తూ, తన పనిచేసుకోవడానికి ముందర చిన్న పిల్లలిద్దర్నీ శిశుపోషణాలయానికి తీసుక వెళ్తుంది.

జీవితం నిజంగా మారిపోయింది, యిప్పటికీ తొకుస్మక్ చిన్నప్పటికీ!



బాలానందం






ఇది నిజంగా జరిగిన కథ. ఉక్రేన్లో ఉంటున్న సెకండరీ పాఠశాల కుర్రవాడు షుయకోవ, సోవియట్ పిల్లల వార్తాపత్రిక "పాయొనీర్ ప్రవ్దా"కు పంపాడు.

"పన్నెండు గంటలకు ఆటల పోటీ వుందని చెప్పావ్ కదూ!" అని అమ్మ ఎడ్డీని అడిగింది. "నీ స్నేహితులు నీకోసం కనిపెట్టుకుని ఉండిఉంటారు!"

ఎడ్డీ గడియారం చూశాడు.

"ఫరవాలేదులే. వాళ్ళు ఉంటారు. నేను సెంటర్ ఫార్వర్డుని!" అంటూ అతను మళ్ళీ చదువులో పడిపోయాడు.

కాని ఎడ్డీ పాఠశాల ఆటల స్థలానికి వచ్చేటప్పటికి, పోటీ మంచి తీవ్రంగా సాగిపోతోంది.

"అది మా జట్టయి వుండదు" అనుకున్నాడు ఎడ్డీ, బంతి చప్పుడు వింటూ.

"కాని నేను లేకుండా వాళ్ళు మొదలు పెట్టలేరు. పెడితే తప్పకుండా ఓడిపోతారు!" అనుకొంటూ అతను కుదుటపడ్డాడు.





ఒకరు తక్కువగా తన జట్టును ఆట స్థలంలో చూసినప్పుడు, అతనికంటె ఎక్కువగా యింకెవరికీ ఆశ్చర్యం కలిగి వుండదు.

ఎడ్డీ ఆట స్థలంలోనికి దూసుకుంటూ వెళ్ళాడు. కాని రిఫరీ అతనిని ఆపాడు. అంచేత యీ "చక్కని ఆటగాని"కి యిక చేయవలసిందేమీ మిగలలేదు, బల్లమీద ఒతికిలపడి, తక్కినవారితో బాటుగా చూడడం తప్పితే.

పాఠశాల జట్టుకు చాలా కష్టంగా ఉంది. ఒక మనిషి తక్కువగా ఆడడం ఎంత కష్టంగా ఉంటుందో ఎడ్డీకి బాగా తెలుసును.

మొదట స్కోరు సమానంగా ఉంది. తరవాత ఎదిరి జట్టే ఎక్కువగా ఒత్తిడితెచ్చి, ముందుకుపోయింది.

ఎడ్డీ బల్లమీద ఆతృతతో గింజుకున్నాడు. అతనికి యింతకంటె పెద్ద శిక్ష ఉండదు!

కాని ఎడ్డీ జట్టు గట్టిగా ప్రతిఘటించింది. వాళ్ళు నిజంగా ఎంతో బాగా ఆడారు, చివరికి వాళ్ళు గెలిచారు.

జట్టు, యింకా ఒక మనిషి తక్కువగా, సంతోషిస్తోన్న గుంపుతోబాటుగా ఆట స్థలంనుండి వెళ్ళిపోయారు. "సాటిలేని" సెంటర్ ఫార్వర్డ్ మాత్రం ఉండిపోయాడు, ఖాళీ అయిపోయిన ఆట స్థలంలో ఒంటరిగా కూచొని.

# బాధ్యతనెరిగిన కోడిపుంజు

"బాగా గూడు కట్టగల పిట్టను కొంగవద్దకు యీ వేళ నేను పంపవలసి వుంది" అంటూ నల్ల కోడిపుంజు తన భార్య, బూడిద రంగు కోడిపెట్టకు చెప్పింది. తన విధుల గురించి అది తరచు తన భార్యను సంప్రదిస్తూ వుంటుంది. "కొండకాటి పక్షిని పంపుదామనుకుంటున్నాను...."

"వద్దు, వద్దు!" అంటూ అరిచింది బూడిద రంగు కోడిపెట్ట భయోత్పాతంతో. "నిన్న మొన్ననే కదా అది నిన్ను తిట్టిపొయ్యడం మర్చిపోయావా?"

"అయితే కాకిని...." అని నల్ల కోడిపుంజు అనబోతూ మొదలుపెట్టింది. "అది బాగా గూళ్ళు కడుతూవుంటుంది."

"నువ్వా ఊసే తలపెట్ట కూడదు!" అని ఘంటాపథంగా చెప్పింది, బూడిదరంగు కోడిపెట్ట. "అది దుష్ప్రచారం సాగిస్తుంది. దానిని పంపినందుకు నువ్వు తరవాత విచారించవలసి వస్తుంది."

"సరే, ఎవరిని పంపమంటావు?"

"కోకిలను పంపించు" అని సలహా చెప్పింది, బూడిదరంగు కోడిపెట్ట. "అది చాలా తెలివైన పిట్ట! నిన్ననే అది నేను వంద సంవత్సరాలు బ్రతుకుతానని హామీనిచ్చింది!"

మర్నాడు నల్ల కోడిపుంజు కోకిలను కొంగ దగ్గరకు తీసుకవెళ్ళింది, పని బెత్తాయించడంకోసం.

## ఈ ఏడాదికి మా వీడ్కోలు

(1వ పుట తరువాయి)

కృశ్చెవ్ నూతన పథకాల గురించి ప్రస్తావించారు—రానున్న 12-15 ఏళ్ళలో, ప్రధాన వస్తూత్పాదనలో వర్తమాన అమెరికన్ ప్రమాణాలను అధిగమించాలన్న నిర్ణయాన్ని నిర్దేశించారు. ఈనాడు, ప్రప్రథమ సోవియట్ స్పుత్నిక్కులు ప్రపంచ పరిభ్రమణం చేస్తున్నప్పుడు, "అమెరికాను అధిగమించడం" అనేది విమర్శకు అతీతమవుతున్నది. ఇప్పుడు, పాల ఉత్పత్తికన్న అతి కఠినమైన మరొక ఉత్పాదక క్షేత్రంలో అమెరికా సోవియట్ దేశాన్ని అందుకోవలసి ఉన్నది.

సోవియట్ సమాజ జీవితం నిరంతరంగా పరిపూర్ణత మొనర్చబడుతున్నది, సోవియట్ ప్రజలు లోపాలను వారించుకొంటూ, సంక్లిష్ట కార్యసాధనకు ఉద్యమిస్తున్నారు. ఉదాహరణకు, సోవియట్ దేశంలో ఇంకా ఇండ్ల కొరత ఉన్నది. ఈ సంవత్సరం: 10-12 సంవత్సరాలలో ఈ కొరతను అంతమొందించాలన్న లక్ష్యం గైకొనబడింది. భారీ ఎత్తున గృహనిర్మాణ కార్యక్రమం ఆచరణలో పెట్టబడుతున్నది.

ఈ 1957, తరువాతి సంవత్సరాలకు మహోపకారం చేసింది. సోవియట్ ప్రజలు తమ ప్రభుత్వం అస్తిత్వంలోకి వచ్చిన అయిదవ దశాబ్దంలో, వినూత్నమైన, ఆశ్చర్యకరమైన విజయాలను సాధించగలరన్న విషయాన్ని ఎవరు సంశయిస్తారు?

# భిలాయ్: భారతీయ నిపుణులకు ఉత్తమ శిక్షణాలయం

(19వ పుట తరువాయి)

అక్కడ శిక్షణను పొందుతున్నారు, లేదా తిరిగివచ్చి నిర్మాణ స్థలంలో పనిచేస్తున్నారు. త్వరలోనే యింకొంతమంది సీనియర్ ఇంజినీర్లు సోవియట్ దేశానికి వెళ్తున్నారు, అక్కడి పనిపద్ధతులను తెలుసుకోవడానికి. వారు తిరిగివచ్చేక, తక్కిన పనివారికి శిక్షణ నిస్తారు.

త్వరలోనే భిలాయ్‌లో ఒక శిక్షణా విద్యాసంస్థ స్థాపింపబడుతుంది. దాని కవసరమైన యంత్రాలు, సామగ్రిలో ఒకభాగం సోవియట్ దేశం నుండి వచ్చివుంది. ప్రతి ఏడూ యిది 1500 మంది శిక్షిత సిబ్బందిని తర్ఫీదుచేస్తుంది.

## సమస్యలపై ఉపన్యాసాలు

ఉపన్యాసాలు భిలాయ్‌లోని ఒక ముఖ్యాంశమని తెలుసుకున్నాను. ఈ సంవత్సరం మధ్యలో సోవియట్, భారతీయ ప్రధాన ఇంజినీర్లు శ్రీ దింషిత్స్, శ్రీ సుబ్బరామన్ సాంకేతికోపన్యాసాలను ఏర్పాటు చేయడం అవసరమని భావించి, అందుకు ఒక సవివరమైన పథకాన్ని తయారు చేశారు. మెకానికల్ ఎరెక్షన్‌శాఖ ప్రత్యేక ప్రవీణుడు శ్రీ ద్విసీయనికోవ్ దీనికి అధిపతిగా నియమింపబడ్డారు. శ్రీ దింషిత్స్, శ్రీ ఖోక్లోవ్, శ్రీ సుబ్బరామన్, ప్రధాన సివిల్ ఇంజినీరు శ్రీ దాసీ ఉపన్యాస విషయాలను ఎంచి, చర్చించారు. ఈ ఉపన్యాసాలను తయారు చేయడంలో వీరందరూ పాల్గొంటారు. రెండు మూడు నెలలు ముందుగా ఒక కార్యక్రమం తయారుచేయబడుతుంది. శ్రీ దింషిత్స్‌తోపాటుగా సోవియట్ ప్రవీణులు యిప్పటికి చాలా ఉపన్యాసాలు యిచ్చారు. భారతీయ ఇంజినీర్లు కూడా తమ అనుభవాల గురించి, పనిపద్ధతుల గురించి ఉపన్యసించారు.

నిర్మాణపు పనులలో రేకెత్తే సమస్యలనుబట్టి ఉపన్యాసాలు ఏర్పాటుచేయబడుతాయి. అన్నిటికంటే కుతూహలజనకమైన విషయం, వివిధ శాఖలకు చెందిన వారందరికీ ముందుగుండా ఉపన్యాస విషయం తెలియజేయబడుతుంది. ఇంజినీర్లూ, సాంకేతిక నిపుణులూ అన్ని హంశాలనూ చర్చిస్తారు, ఉపన్యాసాలు జరగడానికి పూర్వం. ఈ ప్రముఖాంశం, ఉపన్యాసాలన్నిటినీ ఆచరణపూర్వకంగానూ, సన్నిహితంగానూచేసి, సర్వత్రా అపారమైన ఆసక్తిని రేకెత్తిస్తుంది. ఇంతేకాకుండా సాంకేతిక విద్యాలయాలనుండి అప్పుడప్పుడే వచ్చిన చాలామంది యువకులూ, నిపుణులైన సాంకేతిక విషయజ్ఞులూ, ప్రాంతీయ, మాండలిక సహాయక ఇంజినీర్లూ యీ ఉపన్యాసాలకు హాజరవుతారు.

సాంకేతిక చలనచిత్రాలుకూడా చూపబడతాయి. పని సాగుతూ వున్నకొద్దీ ఉపన్యాసాలూ, చలనచిత్రాలు కూడా బాగా ఎక్కువ అవుతాయి.

అక్కడికి నేను వెళ్ళిన తరవాత ఒక విషయం నా మనస్సుకు బాగా హత్తుకుపోయింది. అదేమిటంటే—సోవియట్ ఇంజినీర్లు యిస్తోన్న స్వార్థరహితమైన సహకారమూ, పనిని చేయడంలోనూ, సాంకేతిక హంశాలన్నిటినీ గ్రహించడంలోనూ భారతీయ సిబ్బంది చూపే శ్రద్ధ, భారత దేశ భవిష్యానికి యిది శుభసూచకం. అక్కడ తమ పనిని పూర్తిచేసుకున్నాక వీరిలో కొందరు దేశం అంతటా వ్యాపించి, సంపూర్ణంగా పరిశ్రమీకృతమైన భారతదేశం గురించి కన్న కలలు సఫలం కావడానికి తోడ్పడతారు. భారతీయ ప్రధాన ఇంజినీరు శ్రీ సుబ్బరామన్ యీ విధంగా దీనిని సమీక్షించారు: "ఇతర పరిశ్రమలలో వీరు పనిచేసినప్పుడు, తాము భిలాయ్‌లో శిక్షణను పొందామని చెప్పుకోవడం వారికి గర్వకారణమవుతుంది."

---

## స్నేహానికి స్వరూపం

(3వ పుట తరువాయి)

అత్యంత లావణ్యవతి నర్గిస్—రష్యన్ యాత్రికుడు ప్రేమించిన భారతీయ కర్షక బాలిక పాత్రలో యీమె పక్షీ ప్రేక్షకుల హృదయాలను వశపర్చుకుంటుంది—, విదేశీ అతిథికి మిత్రుడైన భారతీయ జానపదగాయకునిగా బాల్రాజ్ సహానీ.

ఈ వ్యాసంలో నేను సోవియట్ నటుల గురించి ప్రస్తావించను; భారతీయ ప్రేక్షకుల నిర్ణయానికే వారిని వదిలిపెడతాను.

ఎంతో రమ్యమైన రంగులతో, అద్భుతమైన దుస్తులతో యీ ఫిల్ము ఒక మారిదిగా దేవతా కథవలె వుంటుంది. ఇది బాగుందా, బాగులేదా? బాగుందనుకుంటాను. ఏది ఏమైనా సుహృద్భావ సందేశంతో భారత దేశానికి వచ్చిన తొలి యూరోపియన్ చేసిన యీ యాత్ర యిప్పటికే ఒక గాథ అయిపోయింది; యిది వాస్తవిక ఘటననుండి జానపద సాహితీ వస్తువుగా మారిపోయింది. ప్రతిభాశాలురూ, కల్పనా చతురులూ అయిన స్రష్ట రచయితలు ఈపురాతన చరిత్రను ఉత్తేజితగాథగా చెప్పడం, రష్యన్ భారతీయ ప్రజల తొలి సంబంధాల ప్రగాఢమైన జాతీయ స్వభావం ఎక్కువగా హృదయానికి హత్తుకపోయేటట్టుగా చేస్తుంది.

కలినిన్ నగరంలో, ఓల్గానది ఎత్తయిన గట్టుపైని—యిక్కడున్ండే శతాబ్దాక్రితం అఫనసీ నికితిన్ తన దూర ప్రయాణానికి బయలుదేరారు—యీ గొప్ప రష్యన్ యాత్రికునికి, పండితునికి, గ్రంథకర్తకు యిప్పుడొక చక్కని స్మారక చిహ్నం నిలిచివుంది. భారతీయ, సోవియట్ ఫిల్ము పరిశ్రమల ఫలప్రదమైన సహకార సృష్టిఅయిన యీ ఫిల్ము, మన ఉభయప్రజల మైత్రీ జననానికొక సంస్మృతి.

# ఆగ్నేయాసియాలో సామ్రాజ్యవాదుల కవ్వింపు

ఐ. మయెవ్స్కీ

అధ్యక్షుడు సుకర్నోను హత్య చెయ్యడానికి, జకార్తాలో నవంబరు 30న, ఒక పైశాచిక ప్రయత్నం జరిగింది. ఇండోనేషియా ముఖ్యపట్టణ వార్తలబట్టి, యీ దౌర్జన్యచర్య ప్రతిఫలంగా ఏడుగురు మరణించినట్టూ, పిల్లలతోసహా 150మంది గాయపడినట్టు తెలుస్తున్నది.

అధ్యక్షుడు సుకర్నోపై జరిగిన దుష్ట హత్యా ప్రయత్నవార్త ఇండొనేషియన్ ప్రజకు కోపకారణమైంది. ఈ అనాగరక చర్యను ప్రజ, ఇండొనేషియన్ ప్రజా సమైక్యతను భగ్నపరచి, ఇండొనేషియా అంతర్జాతీయ స్థానాలను కూలద్రోసి, తద్వారా ఇండొనేషియా జాతీయ స్వాతంత్ర్యానికే దెబ్బ కొట్టడానికి సామ్రాజ్యవాద శక్తులు చేసిన మరొక ప్రయత్నంగా భావించింది. కనీవినీ ఎరుగని ఇటువంటి నేరాన్ని, ఇండొనేషియా ప్రజలతోపాటు, శాంతి ప్రియులైన ప్రజలందరూ తీవ్రంగా నిరసిస్తున్నారు.

ప్రాక్, పశ్చిమ దేశాల ప్రజలు, అధ్యక్షుడు సుకర్నోపైని యీ హత్యాప్రయత్నం, ఆగ్నేయాసియాలోని దురాక్రమణ సైనిక కూటమైన సియాటోకు చెందిన దేశాల ప్రతినిధుల నాలుగు రోజుల సమావేశం, ఫిలిప్పైన్స్‌లోని బగుయోలో ముగిసిన మరుసటి రోజుననే జరిగినదన్న విషయాన్ని గుర్తించక తప్పరు. "కమ్యూనిస్టు విధ్వంసక చర్యలు" అనబడే విషయం, అమెరికా సేనాధిపతులకు మునుపటి అధిపతి అయిన ఎడ్మిరల్ రాల్‌ఫర్డ్ అధ్యక్షతన బగుయోలో జరిగిన ఆ సమావేశంలోనే పరిశీలించబడింది. కాని పాశ్చాత్య పత్రికల వార్తలు, ఆ సమావేశం యదార్థానికి, స్వతంత్ర విధానాన్ని అనుసరిస్తూ, అమెరికన్ గుత్తపెత్తందార్ల చెప్పుచేతలలో వుండడానికి ఇష్టపడని ఆసియా దేశాలమీద, సియాటో కొనసాగించవలసిన విధ్వంసక చర్యలగురించి చర్చించినట్టు సుస్పష్టం చేస్తున్నాయి.

అమెరికా సారధ్యంలో ఏర్పరచబడిన అగ్నేయాసియాలోని సైనిక కూటం, అమెరికన్ సామ్రాజ్యవాద వలసపెత్తనం ఆసియా దేశాలలో చొప్పింపచేయడానికీ, బ్రిటన్, ఫ్రాన్సు, జపానుల వలస సామ్రాజ్య శిథిలాలమీద నూతనమైన ఒక అమెరికన్ వలస సామ్రాజ్యాన్ని నెలకొల్పేందుకు వాటిని బానిసలు గావించడానికీ ఒక సాధనగా వుండడం యదార్థం. ఇటీవల భారతీయ పత్రికలలో ప్రకటితమైన తైపేలోని (తైవాన్) అమెరికన్ రాయబార కార్యాలయ రహస్య పత్రాలు కూడా, జాతీయార్థిక వ్యవస్థను అభివృద్ధి పరచుకొనుటలోను, స్వాతంత్ర్యాన్ని పటిష్టం చేసుకొనుటలోను సాధించిన విజయాలద్వారా యితర ఆసియా దేశాలపైని అపారంగా ప్రభావం కలిగివున్న చైనా ప్రజారిపబ్లిక్, భారత దేశం, ఇండొనేషియా, బర్మాదేశాలకు వ్యతిరేకంగా సియాటో సైనిక కూటమి గురి పెట్టబడుతున్నదన్న విషయాన్ని విస్పష్టం చేస్తున్నాయి. ఈ సాధికార పత్రాలు, స్వీయ దేశాల స్వాతంత్ర్యాన్ని వ్యతిరేకిస్తూ, వాటిపైన అమెరికన్ గుత్త వ్యాపార సంస్థల కాడిని వేయడానికి సిద్ధమైన జాతీయ వ్యతిరేక శక్తులను అమెరికా బలపర్చడం గురించి, నిష్కపటంగా బహిర్గతం చేస్తున్నాయి.

అమెరికన్ సామ్రాజ్యవాద వర్గాల విధానం, దాని నిజ లక్ష్యాలను శంకించడానికి లేశమాత్రంగానైనా చోటివ్వదు. అమెరికా, ఇతర వలసాధికార దేశాలతో కలసి భారత దేశానికి వ్యతిరేకంగా, వలసాధికారాలు కృత్రిమంగా సృష్టించిన కాశ్మీర్ సమస్యమీద హద్దుమీరిన ఉద్యమాన్ని లేవతీస్తున్నది; పురాతన భారతాంతర్భాగమైన గోవాను కబళించిన పోర్చుగల్‌ను కూడా సమర్థిస్తున్నది. షాన్ రాష్ట్రాన్ని బర్మానుండి విడగొట్టి సియాటోలోనికిలాగి, ఆ భూభాగంలో అమెరికన్ స్థావరాలను నెలకొల్పడానికి, అది బర్మానుండి విడిపోయే ధోరణిని రెచ్చగొడుతున్నది. ఇండొనేషియా అంతర్భాగమైన పశ్చిమ ఇరియన్‌ను కబళించిన డచ్చి వలసపెత్తందార్లనుకూడా ఇది ప్రోత్సహిస్తున్నది.

"దురాక్రమణ సియాటో సైనిక కూటమి ఆగ్నేయాసియాలో యుద్ధ ప్రమాదానికి మూలాధారం." ఈ ప్రమాదాన్ని ప్రతిఘటిస్తున్న ఆగ్నేయాసియాలోని అభివృద్ధి చెందుతున్న ప్రజాశక్తుల వెనుక, అభ్యుదయ మానవకోటి అండదండగా ఉన్నది.

---

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖ తరఫున, జి. ఎఫిమోవ్‌చే 25, బారాకంబా రోడ్, న్యూ ఢిల్లీనుండి, సంపాదితము, ముద్రితము, ప్రచురితము. ముద్రాపకులు: పంజాబి ప్రెస్, సదర్ బజార్, ఢిల్లీ-6.




గైడు: "మా దేశంలో చూడదగిన చోట్లు: ఒక అమెరికన్ విమానాశ్రయం, ఒక బ్రిటిష్ నూనె కంపెనీ, ఒక ఫ్రెంచి బ్యాంకు."

